Jayakṛṣṇadāsu - Vēṅkaṭadāsu, Gujarāti

Kālajñānamu

Madras, 1882

Record no. 137

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

జయకృష్ణదాసు - వేంకటదాసు, గుజరాతి.
కాలజ్ఞానము / శ్రీపరమేశ్వరునిచే శ్రీకుమారస్వామికి ఉపదేశింపబడిన కాలజ్ఞానము, లోకోపకారమునకై గుజరాతి - జయకృష్ణదాసు -వేంకటదాసు గారిచే రచియింపబడి, నివృత్తి - వీరాస్వామిశాస్త్రులవారిచే పరిష్కరింపబడినది. - 3. ముద్రణ. - Madras : శారదానిలయముద్రాక్షరశాల, 1882.
46 p. ;17 cm.
Record no. 137

Jayakṛṣṇadāsu - Vēṅkaṭadāsu, Gujarāti.
Kālajñānamu / Śrīparamēśvarunicē Śrīkumārasvāmiki upadēśimpabaḍina Kālajñānamu, lōkōpakāramunakai Gujarāti - Jayakṛṣṇadāsu -Vēṅkaṭadāsu gāricē raciyimpabaḍi, Nivṛtti - Vīrāsvāmiśāstrulavāricē pariṣkarimpabaḍinadi. - 3. mudraṇa. - Madras : Śāradānilayamudrākṣaraśāla, 1882.
46 p. ;17 cm.
Record no. 137

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

శ్రీరస్తు

జగజ్జన్మాదికారణీభూతుండగు శ్రీపరమేశ్వరునిచే
మానవులకుమరణచిహ్నంబులు - తెలియంబడునటుల,
శ్రీకుమారస్వామికి ఉపదేశింపబడిన

# కాలజ్ఞానము

18067

లోకోపకారమునకై,
గుజరాతి - జయకృష్ణదాసు - వేంకటదాసుగారిచే,
రచియింపబడిన ఆంధ్రటీకాసహితముగ,
గీర్వాణాద్యనేకభాషానిపుణులును ఆయుర్వేదశాస్త్రానుభవజ్ఞులునగు
కాంచీనగరనివాసులగు,
నివృత్తి - వీరాస్వామిశాస్త్రిలవారిచే
లేఖకప్రమాదాదిజనితదోషంబులు లేకుండునట్లు పరిష్కరింపఁబడి

మూడవతూరి,
గొడుగు వేంకటప్పారావుగారిచే
స్వకీయ,
రదానిలయముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

MADRAS.
*[Registerd & Copy right.]*
1882

శ్రీరస్తు

జగజ్జన్మాదికారణీభూతుండగు శ్రీపరమేశ్వరునిచే
మానవులకుమరణచిహ్నంబులు - తెలియంబడునటుల,
శ్రీకుమారస్వామికి ఉపదేశింపబడిన

# కాలజ్ఞానము

లోకోపకారమునకై,
గుజరాతి - జయకృష్ణదాసు - వేంకటదాసుగారిచే,
రచియింపబడిన ఆంధ్రటీకాసహితముగ
గీర్వాణాద్యనేకభాషానిపుణులును ఆయుర్వేదశాస్త్రానుభవజ్ఞులునగు
కాంచీనగరనివాసులగు,
నివృత్తి - వీరాస్వామిశాస్త్రులవారిచే
లేఖకప్రమాదాదిజనితదోషంబులులేకుండునట్లుపరిష్కరింపంబడి

మూడవతూరి,
పిడుగు - వేంకటప్పారావుగారిచే
స్వకీయ,
శారదానిలయముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

MADRAS.

1882

శ్రీరస్తు.

## కాలజ్ఞానవిషయసూచిక.



కాలజ్ఞానవిషయసూచిక - ముగిసెను.



శ్రీ రస్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః.

# కాలజ్ఞానము

శ్లో॥ శ్రీమాన్ క్షీరనిధేస్తటంగతవతో యోబ్రహ్మణః ప్రార్థనాం । స్వీకుర్వన్నిహ దేవకీజఠరతః ప్రాదుర్బభూవాద్భుతం। బిభ్రద్రూపమితస్తతోఽథభవనం నన్దస్య తత్రాద్భుతం। తత్ర శ్రేయోర్వ్రజహారసస్మితముఖో మోదాయకృష్ణోఽస్తునః॥

## అష్టస్థానపరీక్ష.

శ్లో॥ రోగాక్రాంతశరీరస్యస్థానాన్యష్టౌపరీక్షయేత్ । నాడీమూ
త్రంమలంజిహ్వా శబ్దస్పర్శశ్చరూపదృక్॥

తా॥ రోగియొక్క-నాడి-మూత్రము-మలము-జిహ్వ-శబ్దము -స్పర్శ, రూపము, నేత్రములు- అను-నెనిమిదిస్థానంబుల-బరీక్షించుటచే-రోగనిదానస్వరూపంబుల-నెఱుంగందగు.

శ్లో॥ దర్శనస్పర్శనప్రశ్నైర్వ్యాధేర్జ్ఞానంత్రిధామతం। దర్శనా
న్మూత్రజిహ్వాద్యైస్స్పర్శనాన్నాడికాదిభిః।ప్రశ్నైర్దూతా
దివచనాదితిత్రేధాతదుచ్యతే॥

తా॥ రోగస్వరూపమును - దర్శన-స్పర్శన-ప్రశ్నంబులన - ...డు-నుపాయంబులచే-నెఱుంగందగు- అందు దర్శనంబన-మూత్రజిహ్వాదుల-వీక్షించుట-స్పర్శనమన- నాడ్యాదుల - స్పృశించుట-ఈ రెంటిచే-వాత-పిత్త-శ్లేష్మ- ద్వంద్వజ-సన్నిపాత-జనితరోగలక్షణంబులు - స్పష్టంబులగుటయెగాక- రోగసుఖసాధ్య-కృచ్ఛ్రసాధ్య - అసాధ్యంబులునగా- స్పష్టంబులగు-ప్రశ్నయన- దూతవాక్యాదులచే-తత్కాలశుభాశుభలక్షణంబుల-నెఱుంగుట.

## జిహ్వా పరీక్ష.

శ్లో॥ జిహ్వాపరీక్షాక్షిమూత్ర పరీక్షాచపృథక్పృథక్। కథయా
మిసమాసేనలక్షణం మునిభాషణాత్॥

తా॥ జిహ్వ-నేత్ర-మూత్ర-పరీక్షాదిక్రమముల-ప్రత్యేక- ప్రత్యేకంబులుగ-మునీశ్వరులు-చెప్పినచొప్పుననే - సంక్షేపంబుగవచించెద.

శ్లో॥ జిహ్వాపీతాఖరస్పర్శాస్ఫుటితా మారుతాధికే। రక్తాశ్యా
వాభవేత్పిత్తేకఫాచ్ఛుక్లార్ద్రవాఘనా॥

తా॥ నాలుకవాతాధిక్యంబున - పీతవర్ణముగలదిగను- ముండ్లుబారినదిగను-పగిలినదిగను - పిత్తాధిక్యంబున-రక్తవర్ణమిశ్రితశ్యామవర్ణముగలదిగను- శ్లేష్మాధిక్యంబున-తెలుపువర్ణముగలదిగను - ద్రవయుక్తముగను-బరువుగనుండు.

శ్లో॥ కృష్ణాసకంటకాశుష్కాసన్నిపాతాధికేమతా।మిశ్రితేమిశ్రి
తాజ్ఞేయారిష్టేలక్షణవర్జితా। మనుష్యాణాంభవేద్ఘోరాజి
హ్వావిషవిసర్పిణీ॥

తా॥ నాలుక-సన్నిపాతాధిక్యంబున - నలుపువర్ణముగలదిగను - కంటకయుక్తముగను-లేక - తెలుపువర్ణముగలదిగను- ద్వంద్వదోషంబున - ద్వంద్వజవర్ణములుగలదిగను - మృత్యువాసన్నంబగునపుడు - లక్షణవర్జితంబుగనుండుటయగాక-భయంకరముగను - విషమునుగ్రక్కుచునుండు.

శ్లో॥ (అన్యచ్చ)॥వాతేనస్ఫుటితాజిహ్వాసుప్తాశాకదళోపమా।
సరక్తాకంటకాపిత్తేశ్లేష్మణానుప్తలిప్తకా।మిశ్రలింగాద్వం
ద్వజాచసర్వైస్సర్వంవిభావయేత్॥

తా॥ నాలుక-వాతదోషంబున-పలికినట్టుగను- మొద్దుగను,శాకదళోపమానముగను-పి[illegible]దోషంబున - రక్తవర్ణముగలదిగను - ముండ్లుబారినదిగను - శ్లేష్మరోగంబున- చలనరహితంబుగను - బంకగను-ద్వంద్వదోషంబున- పైజెప్పంబడిన ద్వంద్వచిహ్నములుగలదిగను - సన్నిపాతదోషంబున-త్రిదోషచిహ్నయుక్తంబులుగలదిగనుండు (ఇదిమతాంతరము.)

శ్లో॥ జిహ్వావాతాత్ప్రసుప్తాస్ఫుటిత వికసితాశాకపత్రోపమే
యా।పిత్తాద్రక్తాసదాహాభవతిచపరితఃకంటకైర్వ్యాపరీ
తా।గుర్వీస్థూలాసశీతాశ్రితబహుళకఫా శాల్మలీకంటకా
భా। సర్వైస్స్యాత్సర్వలింగాసితరుధిరవహాచిత్రవర్ణాతి
రూక్షా॥

తా॥ నాలుక-వాతదోషంబున - రసాదిజ్ఞానవిహీనంబుగను - పగిలివికసించినటులను-శాకపత్రంబువలెను - పిత్తదోషంబున-రక్తవర్ణముగలదిగను - తాపయుక్తముగను - ముండ్లుబారినదిగను-శ్లేష్మదోషంబున - స్థూలంబుగను-శీతలంబుగను- మిగులకఫయుక్తముగను - శాల్మలీకంటకములతోతుల్యంబుగను- సన్నిపాతంబున-సర్వచిహ్నయుక్తంబుగను - లేక-నలుపుదారియును-రక్తంబును-గ్రక్కుచును-నానావర్ణయుక్తంబుగను-కడురూక్షగను-ఉండు,(ఇదియునుమతాంతరము.)

---

## నేత్ర పరీక్ష.

శ్లో॥ అరుణంధూమ్రవర్ణంచసరౌద్రంచసచంచలం। అభ్యంతరే
కియద్దాహంవాతే నేత్రంతదుచ్యతే॥

తా॥ నేత్రము-వాతదోషంబున - ఎఱుపువర్ణముగలదిగను- లేక-ధూమ్రవర్ణముగలదిగను - భయంకరముగను - చంచలముగను - కించిత్తాపయుక్తముగను-నుండు.

శ్లో॥ హరిద్రాపీతసంకాశంరక్తంవానీలవర్ణకం।దీపద్వేషీసస
తాపంపిత్తేనేత్రంతదుచ్యతే॥

తా॥ నేత్రము-పిత్తదోషంబున - పసపువర్ణముగలదిగను - లేక-రక్తవర్ణముగలదిగను-లేక-నీలవర్ణముగలదిగను - ఉండుటయగాక-దీపద్వేషము-సంతాపము-వీటితోగూడినదిగనుండు.

శ్లో॥ సజలంవిహ్వాలంశ్వేతంజ్యోతిర్హీనంసచంచలం । వీక్షతే
మందమందంచ తచ్చక్షుఃకఫజంవిదుః॥

తా॥ నేత్రము-శ్లేష్మదోషంబున - నీరుకారుచును- కడుతొందరగలదిగను-తెలుపుబారినదిగను - జ్యోతిర్హీనముగను-చంచలముగను - మందదృష్టిగలదిగను-నుండు.

శ్లో॥(అన్యచ్చ)॥ నేత్రంధూమ్రంసజలమనిలేరాత్రిపీతేనతుల్యం।
నీలందీపాసహత్వంసరుధిరమసితందాహయుక్తంచపిత్తే
మందంమదంచపశ్వేతసితజలమతఃకాంతిహీనంకఫాత్తు।
జ్ఞేయంద్వంద్వాద్విలింగంత్రిమలజనయనంశ్యామభుగ్నం
సరౌద్రం॥

తా॥ నేత్రము- వాతదోషంబున - ధూమ్రవర్ణము-గలదిగను - నీరుతో గూడినదిగను-పసపువర్ణముగలదిగను - పిత్తదోషంబున-నీలవర్ణముగలదిగను-రక్తవర్ణముగలదిగను - నలుపుబారినదిగను-నీరుస్రవింపుచును- శ్లేష్మదోషంబున-మందదృష్టిగలదిగను-తెలుపుబారినదిగను -నీరుస్రవింపుచును-కాంతివిహీనముగను- ద్వంద్వదోషంబున- ద్విదోషచిహ్నంబులుగలదిగను - త్రిదోషంబున - త్రిలక్షణయుక్తంబుగను-శ్యామవర్ణముగలదిగను- వంగినదిగను-భయంకరముగను-వుండు (ఇదిమతాంతరము.)

అన్యచ్చ.

శ్లో॥ శుక్లేకఫేఽక్షిణీజ్ఞేయేరక్తేపిత్తేసపీతకే । రూక్షేధూమ్రే
తథావాతేసుప్తపద్మదళోపమే ॥ శ్యావంనిర్భుగ్న సంకా
శంతంద్రామోహసమన్వితం। సరౌద్రంరక్తవర్ణంచ భవే
చ్చక్షుస్త్రిదోషజం॥ ఏకచక్షుర్యదారౌద్రమున్మీలతినిమీల
తి।త్రిభిర్దినైర్విజానీయాత్సయాతియమమందిరం॥కాలంజ్యో
తిర్విహీనంచగతాభ్యంతరలోచనం। మందదృష్టిర్విశేషేణ
కాలప్రాప్తంతమాదిశేత్ ॥ ఏకంచక్షురచైతన్యంవిభ్రమం
స్ఫురణంనచ।దినైకేనవిజానీయాత్తస్యమృత్యుర్నశంశయః॥

తా॥ నేత్రము, శ్లేష్మదోషంబున తెలుపుబారినదిగను, పిత్తదోషంబునరక్తవర్ణముగలదిగను, లేక - పీతవర్ణముగలదిగను, వాతదోషంబున వేడిమిగను, ధూమ్రవర్ణముగలదిగను, చలింపనిపద్మదళంబువలెను, సన్నిపాతంబున, శ్యామవర్ణముగలదిగను, కంట్లగుంటలుపడినదిగను, తంద్ర, మోహము, ఇవిగలదిగను, భయంకరంబుగను, రక్తవర్ణముగలదిగనుండు. మఱియు, సన్నిపాతదోషంబున నొకనేత్రము, భయంకరముగునటుల, యున్మీలన - నిమీలనంబులజేయుచుండెడి రోగి, మూడుదినంబులలోపల, యమాలయంబునకేగు. నేత్రంబులునలుపుబారి, జ్యోతిర్విహీనమైలోనికేగి, విశేషమందదృష్టిగలిగియుండెడినరునికి కాలమాసన్నంబైనదనియెరుంగంవగు. ఒకనేత్రముమాత్రము, చైతన్యవిహీనంబై తిరుగుట, స్ఫురించుట, ఇవిలేకుండెనేని, అట్టివాడొకదినములోన, యమాలయంబునకేగు.

---

## త్రిదోషయుక్తనాసికాపరీక్ష.

శ్లో॥ శుక్లాశుష్కాగురుశ్యావాలిప్తాలుప్తాచనాసికా। నాసికా
మందవికృతాసంవృతాపిత్తకాచితా॥ఊర్ధ్వావాస్ఫుటితా
స్థానాం స్మరణాయభవేన్నృణాం॥

తా॥ నాసిక, శ్వేతవర్ణముగలదిగను, లేక-శ్యామవర్ణముగలదిగను, శుష్కించినదిగను, వాచినదిగను, జిగటుగను, లోపలికిఅణిగినదిగను, మందముగను, భయంకరముగను, సంకుచితమైనదిగను, మిగులపొడవుగలదిగను, బద్దలుగావిచ్చినదానివలెనువుండెనేని, అట్టిరోగి, అతిశీఘ్రంబుగ మృత్యువుపాలగును.

---

## మూత్రపరీక్ష.

శ్లో॥ పశ్చిమేరజనీయామే ఘటికానాంచతుష్టయే । ఉత్థాయ
రోగిణాంవైద్యో మూత్రోత్సర్గంతుకారయేత్ ॥ ఆద్యధా
రాంపరిత్యజ్య మధ్యధారాసముద్భవం। శుభ్రేకాచమయే
పాత్రే ధృత్వామూత్రంపరీక్షయేత్ ॥ సంగృహ్యారోగిణో
మూత్రం సూర్యరశ్మిషుధారయేత్ । తస్యమధ్యేక్షిపేత్తై
లం తతోరోగంవిచారయేత్ ॥

తా ॥ వైద్యుండు, రాత్రినాలవయామంబున నాలుగుగడియలు మిగులియుండగ, రోగినినిదురమేల్కొల్పి, మూత్రోత్సర్జనముచేయించవలయు. అటుతరి, ప్రథమధారనువర్జించి, మధ్యధారను పరిశుద్ధంబైన, కాచపాత్రయందుపట్టి కొని, సూర్యరశ్మియందునిచి, అందొకతైలబిందువువైచి, రోగస్వరూపమునునిర్ణయించవలయు.

## పిత్తప్రకోపాదిమూత్రలక్షణము.

శ్లో॥ పిత్తేనపాండురంమూత్రం సఫేనంకఫరోగిణాం। రక్తవ
ర్ణంభవేద్వాతే ద్వంద్వేజేమిశ్రితంభవేత్॥ సన్నిపాతేతు
కృష్ణంస్యాదేతన్మూత్రస్యలక్షణం॥

తా॥ రోగియొక్క మూత్రము, పిత్తరోగంబున- శ్వేతరక్తమిశ్రితవర్ణముగలదిగను, కఫరోగంబున, నురుగుతోఁగూడినదిగను, వాతరోగంబున, రక్తవర్ణముగలదిగను, ద్వంద్వరోగంబున, ద్విదోషలక్షణయుక్తంబుగను, సన్నిపాతంబున - త్రిలక్షణయుక్తంబై, కృష్ణవర్ణముగలదిగనుండు. ఎట్లన్న - వాతపిత్తద్వంద్వమున- రక్తవర్ణము, నురుగు, వీటితోఁగూడినదిగను, వాతశ్లేష్మమున- రక్తపాండువర్ణముగను, పిత్తశ్లేష్మమున- పాండురవర్ణము, నురుగు, వీటితోఁగూడినదిగను, త్రిదోషమునందు- సర్వలింగములుగలదిగనుండు.

## పిత్తప్రకోపాదులయందులక్షణాంతరము.

శ్లో॥ అచ్ఛంచరూక్షంచసితంచ వాతాదుష్ణారుణంపీతమథో
ఽతిపిత్తాత్। స్నిగ్ధంఘనంశుక్లతరంకఫాచ్చమిశ్రైస్తుమిశ్రం
సకలస్యచిహ్నం॥

తా॥ మూత్రము, వాతాధిక్యంబున, నిర్మలముగను, రూక్షముగను, తెలుపువర్ణముగలదిగను, పిత్తాధిక్యంబున - మిగులవేడిమిగలదిగను, రక్తమిశ్రితపీతవర్ణముగలదిగను, శ్లేష్మాధిక్యంబున - స్నిగ్ధంబుగను, బరువుగను, మిగులతెలుపువర్ణముగలదిగను, ద్వంద్వరోగంబున- మిశ్రవర్ణముగలదిగను, సన్నిపాతంబున-సమస్తచిహ్నంబులుగలదిగనుండు.

శ్లో॥ వాతేనమణ్డంబధ్నాతిపిత్తతోబుద్బుదాయతే। కఫేనబిం
దుమాయాతినిమజ్జతిత్రిదోషకే॥

తా॥ మూత్రమునవైచిన - తైలబిందువు, వాతరోగంబున - మండలాకారంబుగను, పిత్తరోగంబున- బుద్బుదాకారంబుగను, కఫరోగంబున- చినచిన్నబిందువులుగను, త్రిదోషంబున- మునుంగునదిగనుండు.

శ్లో॥ భద్రపీఠపృథుకదర్పణపద్మఛత్రశఙ్ఖసచామరవీణాః। కుండ
లాకృతియదిభవేత్తైలంరోగిణోహియస్యసతుసాధ్యః। ప
క్షికూర్మవృషసింహసూకరైస్సర్పవానరవితానవృశ్చికైః।
కుక్కుటైశ్చసదృశంతు రోగిణోయస్యమూత్రపతితంసగ
తాయుః॥

తా॥ రోగియొక్క మూత్రంబునవైచినతైలబిందువు, భద్రపీఠము, అటుకులు, దర్పణము, పద్మము, ఛత్రము, శంఖము, చామరము, వీణ, కుండలము-అనువానిలో, దేనిఆకారంబుగ పరిణమిల్లెనేని, అట్టివానియొక్క రోగము, సాధ్యంబని తెలిసికొనవలయు. మూత్రంబునవైచిన తైలబిందువు - పక్షి, తాబేలు, వృషభము, సింహము, వరాహము, సర్పము, వానరము, ధ్వజము, వృశ్చికము, కుక్కుటము, వీనిఆకారంబుగపరిణమిల్లెనేని, ఆరోగి గతాయువుగలవాడని - యెఱుంగవలయు.

శ్లో॥ శ్వేతధారామహాధారాపీతాధారాగతదాజ్వరః। రక్తధా
రాదీర్ఘరోగః కృష్ణాచమరణంధ్రువం॥ సౌవీరేణసమంస
స్తంమాతులుఙ్గసమప్రభం। పానీయస్యసమంమూత్రమప
క్వరసతోభవేత్॥

తా॥ మూత్రము తెలుపువర్ణముగను, పీతవర్ణముగను, మహాధారగనునగుచుండిన- జ్వరంబనియు, రక్తవర్ణంబుగనుండిన- దీర్ఘరోగంబనియు, నలుపువర్ణముగనుండిన- మరణముగలుగుననియు నెఱుంగవలయు. రోగి, సౌవీరతుల్యంబుగనేని- మాతులుంగఫలరసతుల్యంబుగనేని- శుద్ధోదకమువలెనేని - మూత్రోత్సర్జనంబుజేసిన, తన్మూత్రము, అపక్వరసమువలనగలిగినదని నెఱుంగవలయు.

శ్లో॥ అథోబహుళమారక్తం మూత్రమాలోక్యతేయదా। వదం
తితదతీసార లింగంతులింగవేదినః॥ జలోదరసముద్భూతం
మూత్రంఘృతకణోపమం। ఆమవాతేవసాతుల్యంతక్రతు
ల్యంతుజాయతే॥ వాతజ్వరసముద్భూతంమూత్రంకుంకు
మపింజరం। మలేనపీతవర్ణంచ బహుళంచప్రజాయతే॥

తా॥ మూత్రమునకధోభాగమున మిగులరక్తవర్ణముగనుండిన- అతిసారరోగలక్షణమనియు, నేతికణములవలెనుండిన-జలోదరంబనియు, వసతోసమానంబుగనేని, మజ్జిగతోఁ సమానంబుగనేనియుండిన- ఆమవాతరోగంబనియు, కుం

కుమువలె నైనగ నేని-మలముతోఁగలసి పీతవర్ణముగ నేని- అధికముగ వెడలుచుండిన- వాతజ్వరంబనియు, నెఱుంగవలయు.

శ్లో॥ పీతస్వచ్ఛంచజాయేత మూత్రంపిత్తోదయేసతి।సమధాతౌ
పునఃకూప జలతుల్యంప్రజాయతే ॥ మూత్రంచకృష్ణతాం
యాతి క్షయరోగాకులస్యచ।క్షయరోగోభవేద్యస్యతమ
సాధ్యంవినిర్దిశేత్ ॥ ఊర్ధ్వంపీతమధోరక్తంమూత్రంవైద్య
వరస్తదా॥పిత్తప్రకృతిసంభూతంసన్నిపాతస్యలక్షయేత్ ।
యస్యేక్షురససంకాశం మూత్రంనేత్రేచపింజరే॥ రసా
ధిక్యంవిజానీయా న్నిర్దిశేత్తస్యలంఘనమ్॥ పీతంచబహు
ళంచైవ ఆమవాతాత్ప్రజాయతే ॥ రక్తంస్వచ్ఛంచయ
న్మూత్రం తజ్జ్వరాధిక్యలక్షణమ్ । ధూమ్రవర్ణంయదా
మూత్రంజ్వరాధిక్యంవదేత్తదా॥కృష్ణమచ్ఛంచజానీయా
త్సన్నిపాతజ్వరోద్భవమ్॥

తా॥ మఱియు, పసుపువర్ణముగలదై, స్వచ్ఛముగనుండిన - పిత్తజ్వరమనియు, కూపజలతుల్యముగనుండిన - సమధాతువనియు, కృష్ణవర్ణంబుగనుండిన- క్షయరోగంబనియు నెరుంగవలయు. అట్టిక్షయరోగము అసాధ్యము. మఱియు, నాపాత్రలోనిమూత్రముపైభాగంబున, పీతవర్ణముగలదిగను, అధోభాగంబున రక్తవర్ణముగలదిగనువుండిన- పిత్తప్రకృతిసంభూతసన్నిపాతరోగంబనియు, చెరుకురసతుల్యంబై, నేత్రములు పింజరవర్ణముగలవిగనుండిన, రసాధిక్యరోగంబనియునెఱింగి, లంఘనమువేయవలయు. మూత్రము పీతవర్ణముగనుండి, అధికమూత్రోత్సర్జనంబగుచుండిన- ఆమవాతరోగంబనియు, తేటగలదై, రక్తవర్ణముగనుండిన- అధివాతజ్వరాధిక్యలక్షణంబనియు, ధూమ్రవర్ణంబుగనుండిన, జ్వరాధిక్యలక్షణమనియు, నిర్మలమై కృష్ణవర్ణముగనుండిన సన్నిపాతజ్వరంబనియు నెఱుంగందగు.

శ్లో॥ పీతంతథోపరికృష్ణచ్ఛాయంబుద్బుదసంయుతమ్।మూత్రం
ప్రసూతిదోషేణసంశయోనాత్రవైద్యరాట్॥ ఆపీతరక్త
ఫేనాదిమస్తుచేక్షురసోపమమ్ । పిత్తేనిలేకఫేమూత్రం
నిరామేచజ్వరేభవేత్ ॥

తా॥ మూత్రము అధోభాగంబున- పీతవర్ణముగలదిగను, పైభాగంబున కృష్ణవర్ణముగలదిగనుండి- బుగ్గలుద్భవిల్లిన ప్రసూతిరోగంబని ఎఱుంగవలయు. మూత్రము పిత్తరోగంబున- పీతవర్ణముగలదిగను, వాతరోగంబున- రక్తవర్ణముగలదిగను, శ్లేష్మరోగంబున- నురుగుతోఁగలసినదిగను,నిరామమున- మీఁగడవలెను, జ్వరంబున- చెరుకురసంబువలెనుండు.

శ్లో॥ తైలబిందుర్యదామూత్రే వికారాన్కురుతేస్వయమ్।స్వ
రూపంతస్యవక్ష్యామి శుభాశుభచికిత్సితమ్॥

తా॥ మూత్రమునందువైచిన తైలబిందువుజెందునట్టివికారస్వరూపంబులను, వానిశుభాశుభఫలంబులను, చికిత్సలను - వచించెద.

శ్లో॥ చికిత్స్యైకైఃకూర్మహాలం సౌరభాకృతిజంభుజం।కరభంమం
డలంకోలమసాధ్యస్యైవలక్షణమ్ ॥ చతుష్పథంచత్రిపథం
ద్విపథంచైవదృశ్యతే ॥ ఏకపథంయదాబిందు ర్మృత్యుస్త
స్యనసంశయః ॥ శస్త్రంఖడ్గం ధనుర్దండం ముసలం వజ్ర
శూలకమ్। లకుటాకారంయదాతైలం తత్క్షణంవాగతా
యుషమ్ ॥

తా ॥ రోగిమూత్రంబునవైచిన - తైలబిందువు:—తాఁబేలు, నాఁగేలు, సౌరభము, భుజము, ఏనుగ, మండలము, వరాహము. ఇట్టిఆకారంబులతోఁగూడియుండిన - నారోగంబసాధ్యమనిఎఱుంగవలయు. మఱియు, నాతైలబిందువు, నాలుగుమార్గంబులుగనైనను, మూడుమార్గంబులుగనైనను, రెండుమార్గంబులుగనైనను ఏకమార్గంబుననైననుఅగుపడెనేని, నట్టిరోగి నిశ్చయముగ-యమపురనివాసియగు. మఱియు- నాతైలబిందువు:—శస్త్రము, ఖడ్గము, ధనుస్సు,దండము,ముసలము,వజ్రము,శూలము, లకుటము, ఇట్టిఆకారములుగలదిగనుండిన- నారోగి,తత్క్షణంబున మృతిజెందు.

శ్లో॥ హంసకారండసంపూర్ణం తటాకందృశ్యతేయదా । పద్మ
రూపంఫలాకారం తైలమూత్రేప్రజాయతే ॥ సర్వవాసక
లంగాత్రంప్రాసాదంయచ్ఛచామరమ్।ఛత్రంచతోరణం
చైవ తైలబిందుశ్చిరాయుషమ్॥

తా॥ ఏరోగిమూత్రమునవైచిన - తైలబిందువు:—హంస, కన్నెలేడిపిట్ట-వీనితోసంపూర్ణమైనతటాకము, పద్మము, ఫలము, సంపూర్ణశరీరము, మేడ, చామరము, ఛత్రము, తోరణము, వీటితోతుల్యముగనుండెడినో, అట్టివాడు - దీర్ఘాయుష్మంతుడనిఎఱుంగవలయు.

శ్లో॥ తైలంబిందుర్యదామూత్రే చాలినీఛిద్రసన్నిభః। శాకిన్యా
గోత్రదేవ్యాశ్చ ద్వయోర్దోషసముద్భవః॥ మూత్రమధ్యే
యదాతైలం పురుషాకృతిదృశ్యతే। గృహదోషంచదేవ్యా
శ్చ విజానీయాద్విచక్షణః ॥ మూత్రమధ్యేయదాతైలం
మండలంబంధయేద్ధ్రువమ్। నిర్దోషంచతతోజ్ఞాత్వా ఔష
ధంనైవకారయేత్ ॥

తా॥ మూత్రంబునవైచిన - తైలబిందువు, జల్లెడవలెమిగుల ఛిద్రంబులుగ లదిగనగుబడిన- శాకినీగ్రహదోషమువలనను, గోత్రదేవతదోషమువలననుజనించినరోగంబనియు, నాతైలబిందువు, పురుషాకారంబుగనగుబడిన- గృహగోత్రదేవతవలనజనించినరోగంబనియు, మూత్రంబునవదలినతైలబిందువు - మండలముగట్టిన- నిర్దోషంబనియునెఱింగి, చికిత్సవదలవలయు.

శ్లో॥ తైలబిందుర్యదామూత్రే త్రికోణాంగంప్రజాయతే। శాకి
న్యాగోత్రదేవ్యాశ్చ ద్వాభ్యాందోషసముద్భవః॥ తైలబిం
దుర్యదామూత్రే చాలినీసదృశోభవేత్ । ప్రేతవ్యంతర
యోర్దోషం ధ్రువంజ్ఞేయంచికిత్సకైః ॥ తైలబిందుర్యదా
మూత్రం నరాకారంప్రజాయతే। గృహదోషంచదేవ్యా
శ్చ విచార్యోఽయంవిచక్షణైః॥

తా॥ మూత్రంబునవదలినతైలబిందువు, త్రికోణాకారంబుగనగుబడిన-శాకినీగ్రహము, గోత్రదేవత, వీటిచేజనించినరోగంబనిఎఱుంగవలయు. మఱియు - నాతైలబిందువు, జల్లెడవలెనయ్యేనేని - ప్రేతదోషమువలనజనించినదోషమని, వైద్యుడెఱుంగవలయు. మఱియు - తైలబిందువు, పురుషాకారంబుగబొడమెనేని, గృహదేవతలవలనజనించినదోషంబనిఎఱుంగవలయు.

శ్లో॥ తైలబిందుర్యదామూత్రే మండపంవర్ధయేత్తతః। నిర్దోషం
చతతోజ్ఞాత్వా భేషజంతన్నకారయేత్ ॥ పూర్వస్యాంవ
ర్ధతేతైలబిందూనాంప్రసరోయది। ఆరోగ్యతాతదానూ
నం రోగో నైవాయుషోస్తుధీః॥

తా॥ మూత్రంబునవైచినతైలబిందువు, మంటపాకారంబుగనయ్యేనేని - నట్టితరి, రోగము నివృత్తించినదనిఎఱింగి - వైద్యశాస్త్రవిశారదుండు, చికిత్సనుమానవలయు. మఱియు, మూత్రంబునవైచినతైలబిందువు, తూర్పుభాగంబున, విశేషంబుగబ్రసరించెనేని- నట్టిరోగియొక్క-వ్యాధి, నిశ్శేషంబుగ నివృత్తించినదనినెఱుంగుటయేగాక - వానికి, ఆయుర్వృద్ధిసగాగలుగునని, నిశ్చయముగనెఱుంగందగు.

శ్లో॥ దక్షిణస్యాంయదాజ్ఞేయం తైలబిందుఃప్రసర్పతి। కియ
ద్భిర్వాసరైస్తస్య మృత్యురేవనసంశయః॥ కౌబేరీంవారు
ణీంచైవ తైలబిందుఃప్రసర్పతి। ఆరోగ్యంచతదానూనంపు
నశ్చాపిప్రజాయతే॥ ఈశాన్యాంతైలబిందూనాం ప్రసరో
యదిజాయతే । సజీవేన్మాసమేకంతు పశ్చాద్యాతియ
మాలయమ్ ॥

తా॥ మూత్రంబునవైచినతైలబిందువు, దక్షిణదిశయందుబ్రసరించిన- నట్టిరోగి, కొద్దిరోజులలోనే, నిశ్చయముగ - వైవస్వతునినిలయంబునకేగుననియు, పశ్చిమోత్తరదిశలయందువ్యాపించెనేని, నట్టిరోగికి, రోగము - శీఘ్రంబుగవదలినను, మరలజనించుననియు; తైలబిందువు, ఈశాన్యదిశయందువ్యాపించెనేని - నట్టిరోగి, నొకమాసము సజీవుడుగనుండి, పిదప - యమునిపురంబునకేగుననియునెఱుంగవలయు.

శ్లో॥ ప్రసారోయదితైలస్య నైరృతీందిశమాశ్రితః। సచ్ఛిద్రంచ
భవేన్మూత్రంతస్యమృత్యుర్నసంశయః ॥ వాయవ్యాందిశ
మాశ్రిత్య తైలస్యప్రసరోభవేత్ । సరోగీయమగేహేచ
శీఘ్రంక్రోశంకరోతిసః॥

తా॥ మూత్రంబునవైచిన తైలబిందువు, నిరృతిదిశయందు, ఛిద్రయుక్తంబుగవ్యాపించెనేని- నట్టిరోగి, నిశ్చయముగ, మృత్యువుపాలగుననియు, వాయవ్యదిశనాశ్రయించి ప్రసరించెనేని, నట్టిరోగి, యతిశీఘ్రింబుగ - యమునినగరంబునకు నయింపంబడుననియు తెలియవలయు.

## కా ల జ్ఞా న వి వ ర ణ ము.

శ్లో॥ కాలజ్ఞానంకాలయుక్తం శంభునాయత్ప్రిభాషితమ్। మా
సైష్షడ్భిర్గుహాయోక్తైర్జ్ఞాయతేమరణంనృణామ్॥ కాలస్త్రి
త్రివిధోజ్ఞేయ స్త్వతీతోనాగతస్తథా। వర్తమానస్తృతీ
యోన్య స్తంపశ్యేశ్శృణుపుత్రక॥ కాలఃకలయతేవిశ్వం
కాలశ్చసృజతిప్రజాః। కాలఃకలయతేలోకాన్ తేనకా
లోవిధీయతే॥

తా॥ కాలయుక్తకాలజ్ఞానమును, శ్రీమజ్జగద్రక్షకుండగుపరమేశ్వరుడు, కుమారస్వామికివచించినతెఱంగున, నారుమాసంబులలో, నరులకుసంప్రాప్తంబయ్యెడి మరణలక్షణంబులదెలియంజేసెద ఓకుమారా వినుడు. కాలము, భూతభవిష్యద్వర్తమానంబులన త్రివిధంబు. అది - ప్రపంచంబును, ప్రజలనుసృజింపుచుండుటంజేసి, కాలంబనిజెప్పంబడు.

## కా ల ప్ర శం స.

శ్లో॥ కాలస్సృజతిభూతాని కాలస్సంహరతేప్రజాః। కాలస్స్వ
పతిజాగర్తి కాలోహిదురతిక్రమః॥ కాలేదేవావినశ్యంతి
కాలేచాసురపన్నగాః। నరేంద్రాజన్తవస్సర్వే సర్వంకా
లేచనశ్యతి॥ కాలోహిభగవాన్విష్ణు స్స్వయంకాలోమ
హేశ్వరః॥ బ్రహ్మాపికాలరూపీచ వర్తంతేకాలసంజ్ఞయా॥

తా॥ కాలము - సర్వభూతంబులసృష్టించునదిగను, ప్రజలను సంహారంబుజేయునదిగను, నిదురజెందునటులజేయునదిగను, మేల్కాంచియుండునటులంజేయునదిగనుండు. కావున - కాలమునతిక్రమించుట. కెవ్వానికి శక్యముగాకయుండు. మఱియు- దేవతలు, అసురులు, సర్పములు, రాజులు, సకలజంతువులును, కాలవశముచేనాశనముజెందెదరు. మఱియు-భగవంతుండగు- విష్ణువు, మహేశ్వరుడు, బ్రహ్మ, వీరలు, కాలస్వరూపులుగాన - కాలులనిజెప్పంబడుచున్నారు.

శ్లో॥ కాలేచఫలతేవృక్షః కాలేధాన్యంప్రజాయతే। కాలేచ
ద్రవతేనారీ సోపికాలోవిధీయతే॥ విరించిదినమధ్యేతు
పతంతీంద్రాశ్చతుర్దశ। సచాపిదినమాసేషు స్వేష్వగచ్ఛ
త్సునశ్యతి॥

తా॥ కాలంబునుబట్టి, వృక్షంబులుఫలించు. ధాన్యంబులుత్పన్నంబులగు. స్త్రీలుఋతుమంతులగుదురుగాన- సకలంబునకు కాలమేకారణము. సకలజగత్సృష్టికర్తయగుబ్రహ్మదేవునియొక్క_నొకదినమునందు- పదునలుగురుదేవేంద్రులును, తనదినములుగడచినపిదప,ఆబ్రహ్మయును, కాలాధీనమువలననశించెదరు.

శ్లో॥ మానుషశ్శతజీవీచ పురావేదేషుభాషితమ్। వికర్మణఃప్ర
భావేన శీఘ్రికాలేవినశ్యతి॥ వర్షాశ్శీతంతథాచోష్ణంప్ర
త్యూషోమధ్యమందినమ్। అపరాహ్ణాస్తథారూపకాలఃకా
లేనకథ్యతే॥ క్రోధలోభప్రసంగేనకాలఃక్షలతిప్రాణినామ్
జ్ఞానయోగసదాభ్యాసైఃకాలోరక్షతిసర్వదా॥

తా॥ మనుజులకు, నూరువత్సరంబులాయువని, వేదములయందుపఠింపబడియున్నది, అయినను, పాపకర్మప్రభావములచే జనులకు, శీఘ్రకాలంబుననే, నాశనముగలుగుచున్నది. కాలంబువలననేగదావర్షము, శీతము, గ్రీష్మము, ఇత్యాదిఋతువులును, ఉషఃప్రాతర్మధ్యాహ్న సాయమాదిసమస్తకాలంబులును గలుగుచున్నయవి. కాలమే, కామక్రోధ లోభమోహాదులచే, మనుజులనునశింపంజేయుచున్నయది. ఐనను, జ్ఞానయోగాభ్యాసములచేమనుజులరక్షింపుచున్నయది.

శ్లో॥ కాలేపానీయమశనం కాలేబీజంతువాపయేత్। కాలేక
ర్మసముద్దిష్టం విపరీతేవిపర్యయః॥ నాకాలేమ్రియతేకశ్చి
న్నాకాలేజాయతేతథా। యోయస్మిన్మ్రియతేకశ్చిద్విద్ధ

శ్శరశతైరపి॥ కాలఃప్రాప్తస్యకౌంతేయవజ్రాయన్తేతృణా
న్యపి।పకోత్తరంమృత్యుశతం బ్రువతేవేదవేదినః॥ తత్రై
కఃకాలసంయుక్తశ్శేషాస్త్వాగంతవస్మృతాః॥

తా॥ జలపానము, ఆహారము, బీజావాపము, సంధ్యాదికర్మలు, కాలమునననుసరించేవిధింపబడియున్నవి, అట్టికాలమునందే, ఆయాక్రియలజేసిన, సుఖాదులకుహేతువగు, కాలమునువదలిజేసిన - నిష్ఫలంబులగు. మఱియు, లోకంబున, నెవ్వాడును, కాలముసంప్రాప్తముగాకనే, జననమరణాదులనొందకుండు - ఆకాలంబున, శతబాణంబులచే, వేధించినను,మరణముగలుగదు. కాలము, సంప్రాప్తంబయ్యెనేనివానికి,తృణంబే,వజ్రాయుధసమానంబగు,లోకమునమృత్యువులు, నూటవొక్క-సంఖ్యగలవని, వేదవేత్తలువచించెదరు. వారిలో, నొకడు, కాలమృత్యువనంబడు,తదితరులు,ఆగంతుక (అకాల) మృత్యువులనంబడుదురు.

శ్లో॥ యథావర్షమకాలేషుయథాపుష్పంయథాఫలమ్।యథా
స్యాద్దీపనిర్వాపమకాలేమరణంతథా॥ జలమగ్నిర్విషంశ
స్త్రం స్త్రియోరాజకులానిచ। అకాలమృత్యవోహ్యేతే
తేభ్యోబిభ్యతిపండితాః॥

తా॥అకాలమునవర్షమువర్షించుట, పుష్పఫలాదులుద్భవిల్లుట,వెలుంగుచుండెడి,దీపజ్యోతి,అకస్మాత్తుగజల్లారుట, వీటిచందంబున, మనుజులు, అకాలమున, మరణంబు,నొందెదరు. జలము, అగ్ని,విషము, ఆయుధంబులు, స్త్రీలు, రాజులు వీరు,అకాలమృత్యువులనినెఱుంగవలయు, ఇట్టి, అకాలమృత్యువులకు, సర్వశాస్త్రసంపన్నులగు, పండితులుసగా, భయంబునొందెదరు.

శ్లో॥ అస్తమేతియథావాతాద్దీపస్తైలాదిసంయుతః। నిర్వాతా
రక్షణాద్దేహీతథైవాగంతుమృత్యుభిః॥ యేచాప్యాగంత
వఃప్రోక్తాస్తేప్రశామ్యంతిభేషజైః। వివిధైర్మంత్రమాంగ
ళ్యైఃకాలమృత్యుఃప్రశామ్యతి॥ నాయుధైర్విషవిప్రాద్యై
ర్నౌషధైరార్తమశ్వినౌ। ఉపక్రమేయంనభవేదకాలమ
రణంయది॥

తా॥ మిగులతైలంబుతోగూడి, యతిప్రకాశమానంబై వెలుంగుచుండెడి, దీపము, గాలివలనరక్షింపబడకపోవుటచే, కనస్మాత్తుగజల్లారుచందంబున, అకాలమృత్యువులవలన, నకస్మాత్తుగ, ప్రాణులునశించెదరు. మఱియు,పైజెప్పంబడిన, ఆగంతుకమృత్యువులు, చికిత్స,నానావిధమంత్రజపములు,నానావిధమంగళాచారములు, వీట్లచేశాంతినిజెందు, ఆయుధప్రహారములు,విషబాధ, విప్రశాపములు, వీటిచే, గలిగెడుఅపమృత్యువును, అశ్వినీదేవతలుసగా, అస్త్రము,ఔషధము, మంత్రము - మొదలగువానిచే, నివృత్తింపంజేయుట, కశక్యులుగనుండెదరు.

శరీరరక్షణోపదేశము.

శ్లో॥ సర్వమన్యత్పరిత్యజ్యశరీరమనుపాలయేత్। తదభావేహి
భావానాంసర్వాభావశ్శరీరిణాం।నగరీనగరస్యేవరథస్యే
వరథీస్సదా। స్వశరీరస్యమేధావీకృత్యేష్వవహితోభవే
త్।హితమభ్యస్యతఃపుంసోనాకాలేకాలదృష్టినా। సం
జాయతేపరామర్శోబలోత్సాహేంద్రియాయుషమ్॥

తా॥ మనుజులు, సర్వకార్యంబులవిడనాడి, శరీరంబును, గాపాడుకొనవలయు, అటులశరీరంబును,రక్షించుటకుపేక్షంజేసితేని, సర్వశుభాశుభకార్యంబులునశించు, నగరాధిపతినగరమును, రథికుడురథమును, గాపాడుచందంబున, బుద్ధిమంతుడగువాడు, స్వదేహరక్షణకృత్యములయందు, మిగులజాగరూకుండై నుండవలయు. ఇటుల శరీరసంరక్షణసేయుచుండువానికి,అకాలమృత్యువుగలుగకుండుటయేగాక, బలము,ఉత్సాహము, ఇంద్రియములు,ఆయువు, ఇవి,సగా వృద్ధినిజెందు.

శ్లో॥ హితాహారవిహారాణాంసదాచారనిషేవిణామ్। లోక
ద్వయమపేక్షాణాం జీవితంత్వమృతాయతే॥విదుషాన్త
శ్శరీరస్థాన్నిత్యంసన్నిహితానరీన్।జిత్వావర్జ్యానివర్జ్యాని
చిరంజీవితుమిచ్ఛతా॥

తా॥ హితమైనఆహారములు, విహారములు, శాస్త్రీయమైనఆచారములు ఇహపరలోకాపేక్ష, ఇవిగలవారియొక్క జీవితకాలము, అమృతతుల్యంబుగనుండు (అనగా,దీర్ఘాయుష్మంతుడుగనుండు) చిరకాలముజీవించుటకు,యిచ్ఛగ

లబుద్ధిపంతుడు, తనశరీరమునందు, నిత్యముగవసించెడి, ప్రబలశత్రువులగు, కామ క్రోధాద్యరిషడ్వర్గములనుజయించి, వర్జించదగిన పాపకృత్యముల, వర్జింపవలయు

శ్లో॥ కాలాగ్నిర్జఠరేయాతితస్యవాఞ్ఛాచతుర్విధా । ఆహార
ఉదకంనిద్రాకామంచైవచతుర్థకమ్ । అన్నహీనాద్దహే
ద్ధాతుమమ్బుహీనాంచ్చశోణితమ్॥ కామహీనాద్దహేచ్చ
క్షురనిద్రారోగకారిణీ॥

తా॥ కాలాగ్ని, మనుజుని, జఠరాంతర్గతంబై, కాలమున, ఆహారము, ఉదకము, నిద్ర, కామము, యీనాలుగింటిని, కోరుచుండు, మఱియు, నదిఅన్న విహీనమగునపుడు, ధాతువును, ఉదకవిహీనమగునపుడు, రక్తమును, కామవిహీనమగునపుడు, నేత్రంబులనుదహింపుచుండు, దానివలననిద్రాభంగము, రోగము ఇవి గలుగు,

## కాలాసన్నపురుషలక్షణము.

శ్లో॥ ఆత్మాశరీరంశ్రుత్యుక్తమంతరాత్మామనోభవేత్ । పరమా
త్మాభవేత్ప్రాణః పంచతత్వానిధారయేత్ । వర్ణహీనం
యదాత్మానం పశ్యత్యాత్మాకథంచన । నాసౌజీవతిలోకే
స్మిన్ కాలేనైవావలోకితః॥

తా॥ శరీరముఆత్మయనియు, మనస్సుఅంతరాత్మయనియు, ప్రాణము పరమాత్మయనియు, వేదమునందుజెప్పంబడియె. మఱియు-నాప్రాణము-పంచతత్వాత్మకమగునీశరీరమును, ధరించియుండుమనుజుడు-బుద్ధిచే, తనశరీరమును, వర్ణవిహీనముగ, (అనగా వికృతముగ) నెపుడుజూచెడినో, నపుడుకాలముచేవీక్షింపబడినవాడైలోకాంతరగతుండగు,

## పాక్షికమృత్యులక్షణము.

శ్లో॥ ప్రకృతిస్థస్సదాజీవో ద్వికృతిశ్చైవగచ్ఛతి । సచవైకాల
దృష్టస్తుక్రియతేజ్యోతివర్జితః॥ సంపూర్ణోవహతేసూర్యస్సో
మశ్చైవనదృశ్యతే । పక్షేనజాయతేమృత్యుః కాలజ్ఞా
నేనభాషితమ్॥

తా॥ స్వభావముగనుండెడిజీవుడు, వికృతినిజెందెనేని, యామనుజుడు, మృత్యువుచే, జూడబడినవాడై, జ్యోతిర్విహీనుడుగజేయంబడు, అదియెటులనిన, సూర్యుడుసంపూర్ణముగను, చంద్రుడుఅసంపూర్ణముగను, గానంబడియెవరో, అట్టిపురుషుడొకపక్షములో, మృత్యువుపాలగునని, కాలజ్ఞానులువచించెదరు.

శ్లో॥ యస్యవస్త్రేస్వశరీరేగన్ధో వాగాత్రాననయోరపి । తస్యా
ర్థమాసికంజ్ఞేయం యోగినాందేవిజీవనమ్॥

తా॥ ఎవనియొక్క-వస్త్రమునందును-శరీరమునందును-ముఖమునందును-దుర్గంధపువాసనగలిగియుండునో - అట్టివాడు-యోగియైనను - పదియైదుదినంబులలోమృత్యువుపాలగు.

శ్లో॥ మాసేనషడ్భిర్మాసైశ్చ పక్షేణైవత్రిమాసికమ్। పంచరా
త్రేణమాసైకం మృత్యోశ్చైవహిలక్షణమ్॥ ఉదయస్సూ
ర్యమార్గేణ చంద్రేణాస్తగతంయది । దశాతిగుణసంఘా
తం విపరీతేవిపర్యయః॥

తా॥ ఒకమాసము-ఆరుమాసములు - ఒకపక్షము-మూడుమాసములు-ఐదుమాసములు - అయిదుదినములు- ఈక్రమంబునగలిగెడు - మృత్యులక్షణంబులవచించెద. ఎవనికి- సూర్యచంద్రులయుదయాస్తమనంబులు - సూర్యచంద్రకళలు - క్రమంబుగగనుపడునో- అట్టివానికి శుభముగలుగుననియు- యవి, విపరీతములయ్యెనేని-విపరీతములగుననియు-నెఱుంగందగు.

శ్లో॥ చంద్రోదయేయదాసూర్యశ్చన్ద్రస్సూర్యోదయేతథా। అశు
భంహానిరుద్వేగ శ్శుభంసర్వనిజోదయే॥

తా॥ చంద్రోదయమున- సూర్యకళయు - సూర్యోదయంబునజంద్రకళయునగుబడిన - అశుభము-హాని-భయము - అనునవిగలుగు- సహజంబుగనగుబడిన-శుభంబుగలుగు.

## సూర్యచంద్రస్వరలక్షణము.

శ్లో॥ శుక్లపక్షేభవేద్వామా కృష్ణపక్షేచదక్షిణా । ఉభయో
స్త్రిదినాన్యాహుర్దృశ్యతేచంద్రసూర్యయోః॥ పంచభూ

తాత్మకో దీపశ్శశి స్నేహసంయుతః । వాతస్యరక్షితా
సూర్య స్తేనజీవస్థిరోభవేత్ ॥ ఆత్మాదీపశిఖాతేన ఆయు
స్స్నేహకలామతః । కాలఃకజ్జళసంభారోవర్తి రేషాతను
స్స్మృతా ॥

తా॥ సూర్యచంద్రులకళలలో- శుక్లపక్షంబున - నాపుకళయు- కృష్ణపక్షంబున- దక్షిణకళయు - మూడుదినంబులు- క్రమముగ నగుపడెనేని - నట్టివాడు- మృతుడని ఎఱుంగవలయు. పంచభూతాత్మక - శరీరరూపదీపము - చంద్రుండను - చమురుతో గూడి - సూర్యునిద్వారా- గాలిచేజల్లారకుండునటుల- రక్షింపబడుటచే- జీవుడుస్థిరంబుగనుండు - జీవరూపదీపమునకు- ఆయువు- చమురుగానున్న కాలమనునది - దీపముయొక్క- ధూమముగానున్న- దేహము - వర్తిగానున్న వుంన్నను.

## మానసలక్షణము.

శ్లో॥ శబ్దేస్పర్శేతథాఘ్రాణే స్వాదేరూపేతథైవచ । మనశ్చ
హారతేయేన రహామానసఉచ్యతే ॥ తీర్థస్నానేగురౌదేవే
ధ్యానేదానేతపస్సుచ । మనశ్చహారతేయత్రకర్తామానస
ఉచ్యతే ॥ కాయాభవనమధ్యేచ శాంతికర్మాణి కారణమ్ ॥
మనశ్చహారతేయేన రహామానసఉచ్యతే ॥

తా॥ శబ్దము, స్పర్శ, వాసన, రుచి, రూపము, వీటిలో దేనియందు మనస్సు క్రమంబుగలయించునో, అది రహామానసమనంబడు. తీర్థస్నానము, గురువు, దేవత, ధ్యానము, దానము, తపస్సు, వీటిలో దేనియందు మనములయించెడినో, అది - మానసకర్తయనంబడు. కాయమనెడుగృహవిషయమై, శాంతికర్మలుజేయునిమిత్తము, మనస్సు దేనియందులయించెడినో, యది- రహామానసమనంబడు.

## ప్రాణసంఖ్యాపరిమాణము.

శ్లో॥ ఏకవింశతిసహస్రాణి శతానిషట్తథైవచ । నిశాహేచలతః
ప్రాణ స్సచకాలేవినశ్యతి । కాయాభవనమధ్యేచమారు
తోరక్షపాలకః । ప్రవేశేదశభిఃప్రోక్తో ద్వాదశాంగుళని
ర్గమే ॥ మనశ్చైవస్థిరంయస్మాన్మనసామారుతస్థిరః । మారు
తేనస్థిరం తేజః కాలస్సదృశ్యతేతదా ॥

తా॥ మనుజులకు ప్రతిదిన మహోరాత్రములయందు, (౨౧౬౦౦) ఉచ్ఛ్వాసంబులుగలిగియుండు. అట్టియుచ్ఛ్వాసంబులు కాలాధీనంబై నశించు. దేహంబనెడు గృహమధ్యంబున, వాయువు రక్షపాలకుడుగనుండు. అట్టివాయువు ప్రవేశకాలంబున, దశాంగుళప్రమాణంబుగలదిగను, నిర్గమనకాలంబున, ద్వాదశాంగుళప్రమాణంబుగలదిగనుండు. పురుషునకు, మనంబు స్థిరంబుగనుండవలయు. అందుచే- వాయువును, వాయువుచే- నగ్నియును, స్థిరంబుగనుండు. అట్టి అగ్నిసగా - కాలము నేనిరీక్షింపుచుండు.

## వాతాదిస్వరలక్షణము.

శ్లో॥ వాతఃపిత్తంకఫశ్చైవ జ్ఞాయతేధాతుదర్శనాత్ । భేదా
భేదనిబంధేనకాలజ్ఞానేసదాధ్రువమ్ ॥ గంభీరశ్చభవేచ్ఛ్లే
ష్మాస్ఫుటవక్తాచపిత్తలః । ఉభాభ్యాంహీనతోవాతస్తేషాం
చస్వరలక్షణమ్ ॥ త్వరితాఙ్గోభవేత్పిత్తే వాతేనైవతుమం
దతా । స్థిరగామీభవేచ్ఛ్లేష్మాగతేరేతచ్చచేష్టితమ్ ॥

తా॥ భేదాభేదయుక్తకాలజ్ఞానవిషయమై, వాతపిత్తకఫరూపసమస్తధాతుదర్శనముచే, నిశ్చయజ్ఞానములుగలుగు. శ్లేష్మయుక్తపురుషుడు, గంభీరస్వరముగలవాడుగను, పిత్తయుక్తపురుషుడు, స్పష్టమైనమాటలుగలవాడుగను, వాతయుక్తపురుషుడు, సమస్వరముగలవాడుగనుండు. ఉభయధాతుయుక్తపురుషుడు, స్ఫుటమందస్వరయుక్తుడుగనుండు. పిత్తయుక్తపురుషుడు, త్వరితగతిగలవాడుగను, వాతయుక్తపురుషుడు, మందగతిగలవాడుగను, శ్లేష్మయుక్తపురుషుడు, స్థిరగతిగలవాడుగనుండు.

## వాతాదిప్రకృతిదేహలక్షణము.

శ్లో॥ పిత్తరోగీభవేదుష్ణో వాతరోగీచశీతలః । శ్లేష్మరోగీతథా
ద్రిశ్చ దేహస్తస్యైవలక్షణమ్ ॥ అథోచజాయతేరోగస్సా
ధ్యోఽసాధ్యస్తథైవచ । సకలంనిష్ఫలంచాపి జీవితంమర

ణంధ్రువమ్ ॥ సకలంకాలహీనంచ నిష్ఫలంకాలసంయుతమ్।ఇంద్రియాణాంవికారైశ్చజ్ఞాయతేమృత్యుజీవితమ్॥

తా॥ పిత్తరోగికి. దేహముష్ణంబుగను, వాతరోగికి, శీతలముగను, శ్లేష్మరోగికి, ఆర్ద్రంబుగనుండు. రోగోద్భవకాలంబుననే, రోగసాధ్యాసాధ్యంబులనెఱుంగందగు. కాలజ్ఞానవిహీనునికి, సకలకార్యంబులునిష్ఫలంబులగుటయేగాక, జీవించువానిమరణమునకునగా, వాడేకారణంబుగనుండు. మఱియు, కాలము, ఇంద్రియములవికారము, వీనినిఎఱింగినవానికి, జీవితమృత్యుజ్ఞానంబులు సగాగలుగు.

## రోగనివృత్తిలక్షణము.

శ్లో॥ పాణిపాదౌభవేమష్ణౌ దీర్ఘస్వల్పస్తథైవచ। జిహ్వాకోమలతాంయాంతి సరోగీనవినశ్యతి ॥ స్వేదహీనోజ్వరోయస్య నాసాశ్వాసఃప్రవర్తతే। కంఠోఽపికఫహీనస్తు సరోగీజీవతేధ్రువమ్॥

తా॥ హస్తపాదంబులుష్ణంబులుగను, దీర్ఘంబులుగను, లేక-స్వల్పంబులుగను, నాలుక మృదువుగనుండెడిరోగికి, నాశనముగలుగకుండు. ఎవనికి, స్వేదహీనంబగుజ్వరముజనించి, ముక్కులనుండి శ్వాసంబువెడలుచు, కంఠము, కఫహీనంబుగనుండెడినో, నట్టిరోగి - నిశ్చయంబుగజీవించు.

శ్లో॥ నిద్రాసౌఖ్యంభవేద్యస్యశరీరస్యోద్యమస్తథా। ఇంద్రియాణిప్రసన్నాని సరోగీనవినశ్యతి॥ చైతన్యంసకలంయస్య గంధస్వాదంస్ఫుటంభవేత్ । కలాపూరితకంఠస్తుసజీవేన్నాత్రసంశయః।

తా॥ ఎవనికినిద్రాసౌఖ్యంబును,శరీరమునందుత్సాహంబును,ఇంద్రియంబులు ప్రసన్నంబులుగనుండెడినో,నట్టిరోగినాశమునుజెందకుండు. ఎవని సర్వేంద్రియములు,చైతన్యయుక్తంబులై,గంధస్వాద- గ్రహణశక్తిగలవిగనుండెడినో, కంఠనాదముక్షీణింపకుండెడినో, నట్టివాడు, నిశ్చయంబుగజీవించు.

## అసాధ్యలక్షణము.

శ్లో॥ అనిలోయాతిపిత్తస్య పిత్తంయాతికఫంగృహే । కఫశ్చకంఠమాయాతిమర్లభంతస్యజీవితమ్॥ రాత్రౌదాహంభవేదస్యదివాశీతంచజాయతే। కఫపూరితకంఠస్తుతస్యమృత్యుర్భవేద్ధ్రువమ్ ॥ హీనస్వరోభ్రష్టగుదః కాసశ్వాససమాకులః। హిక్కాశోషసమాయుక్తః కుక్షిశూలీనజీవతి॥

తా॥ ఎవనికివాతము పిత్తస్థానంబును,పిత్తము కఫస్థానంబును,కఫము కంఠస్థానంబును,జెందెడినో, నట్టిరోగిజీవించుటదుర్లభంబని ఎఱుంగవలయు. ఎవని శరీరము రాత్రులయందుష్ణంబుగను, పగటియందు శీతలంబుగను, కంఠము కఫపూరితంబుగనుండెడినో, నట్టివానికి నిశ్చయముగ మరణముగలుగు - ఎవడు హీనస్వరముగలవాడుగను, భ్రష్టగుదముగలవాడుగను, కాస, శ్వాసయుక్తుడుగను, ఎక్కిళ్లు, శోషగలవాడుగను, కుక్షిశూలగలవాడుగ నుండెడినో, నట్టివాడతిశీఘ్రంబుగ మృత్యువుపాలగునని ఎఱుంగవలయు.

శ్లో॥ హృదయంచతథానాసా పాదౌపాణీచశీతలౌ । శిరస్తాపోభవేద్యస్య తస్యమృత్యుర్భవేద్ధ్రువమ్ ॥ పూపాభమరుణశ్యావహారితంనీలపీతకమ్ । ష్ఠీవతిశ్వాసకాసార్తోనజీవతిహతస్వరః ॥ అంగకంపోఽంగతేర్భంగో వర్ణభ్రంశస్తథైవచ। గంధంస్వాదంనజానాతి సగచ్ఛేద్యమశాసనే॥

తా॥ ఎవనికి హృదయంబును, నాసికయును, హస్తపాదంబులును,శీతలయుక్తంబై శిరస్సు తాపయుక్తంబుగ నుండెడినో, నట్టివాడు నిశ్చయంబుగ యమపురనివాసియగు. ఎవనికి కారిమూయునపుడు కఫముఅపూపంబువలెనె, ఎఱుపువర్ణముగలదిగను, శ్యామవర్ణముగలదిగను, ఆకుపసుపువర్ణముగలదిగను, నీలవర్ణముగలదగను, పీతవర్ణముగలదిగనుండెడినో, హీనస్వరము, శ్వాస, ఇనిగలిగియుండెడినో, అట్టివాడు మృత్యువు పాలగునని ఎఱుంగవలయు. ఎవని అంగము కంపయుక్తముగను, గతిభంగముగలదిగను, వర్ణహీనముగనుండెడినో, ఎవనికి వాసన, రుచి తెలియకుండెడినో, అట్టివాడు కృతాంతగేహ ప్రవిష్టుండగునని ఎఱుంగవలయు.

శ్లో॥ శిరస్స్వేదోభవేద్యస్య ముఖేశ్వాసః ప్రవర్తతే। అష్టనాడీ అనిర్వాహంసోఽపికాలేనవీక్షితః। అరుంధతీంధ్రువంచైవ విష్ణోస్త్రీణిపదానిచ। ఆయుర్హీనానపశ్యంతి చతుర్థంమాతృమండలమ్॥ అరుంధతీభవేజ్జిహ్వా ధ్రువోనాసాగ్రమేవచ। ధ్రువౌవిష్ణుపదేవిద్యాత్తారకామాతృమండలమ్॥

తా॥ ఎవనిశిరస్సు స్వేదయుక్తంబుగను, ముఖము శ్వాసయుక్తంబుగను, అష్టనాడులకు నిర్వాహంబుగను, గలిగియుండెనేని, అట్టివాడు కాటికి కాలుచాచియున్నాడని ఎఱుంగవలయు. అరుంధతి, ధ్రువుడు, విష్ణుసంబంధమైన మూడుపదంబులు, మాతృమండలము, ఇవి ఆయుర్హీనులకగుపడవు. అరుంధతియన జిహ్వయనియు, ధ్రువుడన నాసాగ్రమనియు, విష్ణుపదంబనకనుబొమలనియు, మాతృమండల మనకంటిపాపయనియు, నెఱుంగవలయు.

శ్లో॥ మతిభ్రంశస్షలేద్వాణీ ధనురంధ్రంనవీక్షతే। రాత్రౌచంద్రద్వయంవాపి రాత్రౌచంద్రదివాకరౌ॥ దివావాతారకాచంద్రంరాత్రౌవ్యోమవితారకమ్। యుగపచ్చచతుర్దిక్షుశక్రకోదండమండలమ్॥ భూధరోభూధరాగ్రేవా గంధర్వనగరాలయమ్। దివానిశిచంద్రశంభురేతేపంచత్వహేతవః॥

తా॥ మనుజునికి మతిభ్రంశముగలుగుట మాటలడ్డముబడుట, వింటిరంధ్రము గనుబడకయుండుట, రాత్రియందు చంద్రద్వయంబగుబడుట, సూర్యచంద్రులగుబడుట, పగటియందు చంద్రనక్షత్రములగాంచుట, రాత్రియందు నక్షత్రదర్శనము లేకుండుట, ఏకకాలంబున నలుదిక్కులయందును, ఇంద్రధనస్సులగుబడుట, పర్వతముసంధైనను, పర్వతాగ్రమునందైనను, గంధర్వనగరమును దర్శించుట, పగటియందు చంద్రునిగాంచుట, రాత్రియందు శంబూకాకారసముదాయ చంద్రునివీక్షించుట, ఇనిమరణచిహ్నంబులని ఎఱుంగందగు.

## నక్షత్రలగ్నతిథివారసాధ్యలక్షణము.

శ్లో॥ అహిర్బుధ్న్యేశతిష్య సంజ్ఞేఽర్యమర్క్షే ప్రాజాపత్యాదిత్యయోస్సప్తరాత్రాత్। రోగోత్పత్తిర్జాయతేమానవానాం నిస్సందిగ్ధం జల్పితంగర్గముఖ్యైః। నందాచవృశ్చికేమేషే భద్రామిథునకన్యయోః। కర్కేచైవజయాసింహే కుంభేరిక్తాతులేవృషే॥ ధనాయుగ్మేచమకరే పూర్ణాతిథిరుదాహృతా॥ విరుద్ధోరోగిణాంనూనం నందాదిస్తిథిపంచకః॥

తా॥ ఉత్తరాభాద్ర, పుష్యమి, పుబ్బ, రోహిణి, పునర్వసు, నక్షత్రములయందు - జనించినరోగము, నేడుదినంబులలో, నిస్సంశయముగనివర్తించు. నందయను పాడ్యమి, షష్ఠి, ఏకాదశితిథులయందు, మేషవృశ్చికలగ్నంబులయందు భద్రయనువిదియ, సప్తమి, ద్వాదశితిథులయందు, మిథున - కన్యాలగ్నములయందు, జయయను - తదియ, అష్టమి, త్రయోదశితిథులయందు, కర్కాటకసింహాలగ్నంబులయందు, రిక్తయను-చవతి, నవమి, చతుర్దశితిథులయందు- తులావృషభ, కుంభలగ్నంబులయందు, పూర్ణయనుపంచమి, దశమి, పౌర్ణమితిథులయందు, ధనుర్మీన మకరలగ్నంబులయందు రోగముజనించిన, రోగికిమిగుల సంకటమును గలుగంజేయు.

శ్లో॥ భౌమకృత్తికయోర్నందాభద్రాచబుధనాగయోః। జయాంగురౌమఘాయాంచ రిక్తాశుక్రధనిష్ఠయోః। భరణ్యాశనివారేచ పూర్ణాచతిథిపంచకే। యోగేష్వేన్వ్యాధిరుత్పన్నేన సిధ్యతికదాచన॥

తా॥ భౌమవారము, కృత్తికానక్షత్రము, నందయనుతిథులు, బుధవారము ఆశ్లేషానక్షత్రము, భద్రతిథులును, గురువారము, మఘానక్షత్రము, జయయనుతిథులు, శుక్రవారము, ధనిష్ఠానక్షత్రము, రిక్తయనుతిథులు, శనివారము, భరణీనక్షత్రము, పూర్ణతిథులు, వీనిసంయోగదినములయందు రోగపీడితుడైనవాడు, కాలునినిలయంబునకేగు.

## నక్షత్రైర్మృత్యురోగ - నివృత్త్యోర్లక్షణము.

శ్లో॥ స్వాతీశ్లేషార్ద్రపూర్వాసుశాక్రేరోగోత్పత్తిర్జాయతే యస్యపుంసః। తద్భైషజ్యంనైవదేయం కదాపిజ్ఞాత్వామృత్యుంవైద్యరాజేనపుంసా॥ వ్యాధ్యుత్పత్తిర్యస్యపౌష్ణేసమైత్రే ప్రాణత్యాగంజాయతేతస్యకృచ్ఛాత్। వైశ్వే

సౌమ్యేరోగముక్తిస్తుమాసాద్వింశత్యాస్యాద్వాసరాణాం మఖాసు॥ పక్షార్ధస్తేవాసవేసద్విదైవేమూలాశ్వినోర్యరగ్ని ధిష్ణ్యేనవాహాత్ ॥

తా॥ స్వాతి, ఆశ్లేష, ఆర్ద్ర, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, పూర్వఫల్గుని, జ్యేష్ఠనక్షత్రములజనించినరోగము రోగిని, మార్తాండనందనునిగృహంబునకేగునటులంజేయునని ఎఱింగి, వైద్యుండు, చికిత్సనువర్జింపవలయు. రేవతి, అనూరాధనక్షత్రములజనించినరోగము, రోగికికడుకష్టంబులుగలుగంజేసి, వాని ప్రాణంబులహరింపంజేయు. ఉత్తరాషాఢ - మృగశిరనక్షత్రంబులజనించినరోగము, (౧)మాసములోను, మఖానక్షత్రమునజనించినరోగము, (౨౦) దినంబులలోను, హస్త, ధనిష్ఠ - విశాఖనక్షత్రంబులజనించినరోగము,(౧)పక్షములోను, మూల, అశ్విని - కృత్తికానక్షత్రంబులజనించినరోగము, (౮) దినంబులలోను నివృత్తియగు.

నక్షత్రజన్మఫలము.

శ్లో॥ కృత్తికాయాంయదావ్యాధిరుత్పన్నోభవతిస్వయమ్। నవ
రాత్రంభవేత్పీడా త్రిరాత్రంరోహిణీషుచ ॥మృగశీర్షేస
ప్తరాత్ర మార్ద్రాయాంముచ్యతేఽసుభిః । పునర్వసౌత
థాపుష్యేసప్తరాత్రేణమోచనమ్।నవరాత్రంతథాశ్లేషే
శ్మశానాన్తంమఖాసుచ।ద్వౌమాసౌపూర్వఫల్గున్యాముత్త
రాసుత్రిపంచకమ్ ॥ హస్తేచసప్తమేమోక్షశ్చిత్రాయా
మర్ధమాసకమ్ । మాసద్వయంతథాస్వాత్యాం విశాఖేది
నవింశతి। మైత్రేచైవదశాహానిజ్యేష్ఠాయామర్ధమాసకమ్।
మూలేనజాయతేమోక్షః పూర్వాషాఢేత్రిపంచకమ్।ఉ
త్తరేదినవింశత్యా ద్వౌమాసౌశ్రవణేతథా । ధనిష్ఠాయా
మర్ధమాసో వారుణేచదశాహకమ్ ॥ పూర్వాభాద్రపదే
దేవి ఊనవింశతివాసరమ్ ॥ త్రిపక్షంచాహిర్బుధ్నేచరేవ
త్యాందశరాత్రకమ్ । అహోరాత్రంతథాశ్విన్యాంభర
ణ్యాంతుగతాయుషః। ఏవంక్రమేణజానీయాన్నక్షత్రేషు
యథోచితమ్ ॥

తా॥ కృత్తికానక్షత్రమునజనించినరోగము, (౮) రాత్రులును, రోహిణీనక్షత్రమునజనించినరోగము, (౩) రాత్రులును, మృగశీర్షానక్షత్రమునజనించినరోగము, (౭) రాత్రులునుపీడించు. ఆర్ద్రానక్షత్రమునజనించినరోగంబును, పునర్వసు,పుష్యమి-నక్షత్రములజనించినరోగంబును, రోగిప్రాణంబులఁబోకడచు. ఆశ్లేష - మఖ-నక్షత్రములజనించినరోగము, (౮) రాత్రులలో రోగిని, శ్మశానవాసిగజేయు. పుబ్బ- ఉత్తర-నక్షత్రములజనించినరోగము,క్రమముగ.(౨)మాసములు, లేక- (౧) పక్షములో రోగిని, వైవస్వతపట్టణంబునకేగునటులంజేయు. హస్తానక్షత్రమున జనించినరోగము, (౭) దినంబులలోను, చిత్తానక్షత్రమునజనించినరోగము, (అర్ధమాసంబులోను,) స్వాతీనక్షత్రమునజనించినరోగము - (౨) మాసంబులలోను, విశాఖానక్షత్రమునజనించినరోగము, (౨౦) దినంబులలోను, అనూరాధానక్షత్రమునజనించినరోగము, (౧౦)దినంబులలోను,జ్యేష్ఠ - మూలానక్షత్రములజనించినరోగము,(అర్ధమాసంబులోను)పూర్వాషాఢానక్షత్రమునజనించినరోగము, (౧) పక్షములోను, ఉత్తరాషాఢానక్షత్రమునజనించినరోగము, (౨౦) దినంబులలోను, శ్రవణనక్షత్రమునజనించినరోగము, (౨)మాసంబులలోను, ధనిష్ఠానక్షత్రమునజనించినరోగము, (అర్ధమాసంబులోను,) శతభిషానక్షత్రంబునజనించినరోగము, (౧౦) దినంబులలోను,పూర్వాభాద్రనక్షత్రమునజనించినరోగము, (౧౮) దినంబులలోను, ఉత్తరాభాద్రనక్షత్రమునజనించినరోగము, (౩)పక్షంబులలోను,రేవతీనక్షత్రమునజనించినరోగము, (౩) పక్షంబులలోను-అశ్వినీనక్షత్రమున జనించినరోగము, (౧) దినంబులోనునివర్తించు. భరణీ నక్షత్రమున జనించినరోగము, కాలాంతకుని కడకేగునటులంజేయు. కావున, పూర్వోక్త అశ్విన్యాదినక్షత్రముల జనించినరోగ - శుభాశుభఫలంబుల, యథాక్రమంబుగ ఎఱుంగవలయు.

జ్వరాదికాలనిర్ణయము.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి జ్వరకాలాదినిర్ణయమ్ ॥ కాలం
శాస్త్రేణవిజ్ఞాయ చికిత్సాంశాన్తిమాచరేత్ ॥

తా॥ ఇక-జ్వరాదులకాలనిర్ణయమునువచించెద. కాలమును, శాస్త్రమువలననెఱింగి, తదనుగుణ్యముగ, చికిత్సలను,నక్షత్రాదిశాంతులను, జేయవలయు.

శ్లో॥ రేవత్యామనురాధాయాంజ్వరోబహుదినంభవేత్ ।మూ
లాశ్వినీకృత్తికాసుద్విమాసంరోగసంభవః॥

తా॥ రేవతి, అనూరాధ - నక్షత్రములజనించినజ్వరము, రోగిని, బహు దినములుపీడించు. మూల, అశ్విని, కృత్తిక - నక్షత్రములజనించినరోగము, రెండుమాసంబులుపీడించు.

శ్లో॥ భరణ్యాంశ్రవణేచిత్రే శతతారాసుయోజ్వరః । ఏకాదశందినంజ్ఞేయంమఖాయాంవింశతిస్తథా॥

తా॥ భరణి, శ్రవణ, చిత్త, శతభిష- నక్షత్రములజనించినరోగము, పదునకొండుదినంబులును, మఖానక్షత్రమునజనించినరోగము, ఇరువదిదినంబులును పీడించు.

శ్లో॥ ధనిష్ఠాసువిశాఖాసుహస్తే పంచదశావధి। తథామృతోత్త రాషాఢానక్షత్రేమాససమ్మతే॥

తా॥ ధనిష్ఠ, విశాఖ, హస్త - నక్షత్రములజనించినరోగము, పదియేనుదినంబులును, మృగశీర్ష, ఉత్తరాషాఢ - నక్షత్రములజనించినరోగము, ముప్పదిదినంబులునుపీడించు.

శ్లో॥ ఉత్తరాయాంతథాపుష్యేరోహిణ్యాంచపునర్వసౌ । తథోత్తరాభాద్రపదానక్షత్రేసప్తవాసరాః॥

తా॥ ఉత్తర, పుష్యమి, రోహిణి, పునర్వసు, ఉత్తరాభాద్ర - నక్షత్రములజనించినరోగము, నేడహోరాత్రంబులుపీడించు.

శ్లో॥ ఆర్ద్రాశ్లేష త్రిపూర్వాసు జ్యేష్ఠాస్వాతౌతదంకతః॥

తా॥ ఆర్ద్ర, ఆశ్లేష, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, జ్యేష్ఠ, స్వాతి నక్షత్రముల రోగపీడితుడైనవాని కానక్షత్రమెన్నవదియో యన్నిదినంబులుపీడించు.

శ్లో॥ జన్మనక్షత్రరోగాప్తౌమండలందేహపీడనమ్। జన్మవారేజ్వరోత్పత్తౌమండలార్ధంవినిర్దిశేత్॥

తా॥ జన్మనక్షత్రమునజనించినరోగము, నలువదిదినంబులును, జన్మవారమున జనించినరోగము, నిరువదిదినంబులునుపీడించు.

శ్లో॥ తథాజన్మదినేరోగోమాంసపీడయతిధ్రువమ్ । రోగోద్భవోజన్మలగ్నేద్వాదశాహంబుధావిదుః॥

తా॥ జన్మదివసమున జనించినరోగము, (౩) దినంబులును, జన్మలగ్నమునజనించినరోగము, (౧౨) దినంబులునుపీడించు.

శ్లో॥ అమాయాంభరణీయోగే షాణ్మాసంజ్వరమాదిశేత్ ।కృష్ణాష్టమ్యాంమందవారేరోగంపర్వాంతమాదిశేత్॥

తా॥ భరణీనక్షత్రయుక్తామావాస్యయందుజనించినరోగము, ఆరుమాసంబులును, స్థిరవారయుక్తకృష్ణాష్టమియందుజనించినరోగము, పైనెలపున్నమ వరకుపీడించు.

శ్లో॥ కృష్ణాంగారచతుర్దశ్యాంసార్ధమాసేమహాభయమ్। భానువారేగ్నినక్షత్రే ద్వావింశద్దినమీరితమ్॥

తా॥ మంగళవారముతోగూడిన, కృష్ణచతుర్దశియందుజనించినరోగమొకటిన్నరనెల, కడుభయంకరముగనుండు. కృత్తికానక్షత్రయుక్త - భానువారంబునజనించినరోగము, ఇరువదిదినంబులుపీడించు.

శ్లో॥ విపన్నైధనతారాసు సప్తాహంరోగపీడనమ్। త్రయోవింశతినక్షత్రే జన్మనక్షత్రతోగదః॥

తా॥ విపత్తార, నైధనతార - అనువానియందుజనించినరోగము, ఏడుదినంబులును, ఇరువదిమూడవనక్షత్రమునజనించినరోగము, జన్మనక్షత్రమువలె, నలువదిదినంబులుపీడించి, తదనంతరమునివృత్తించు.

శ్లో॥ త్రయోవింశద్దినాంతస్యాద్విషనాడీషుయోగదః । అష్టాహంబాధతేవ్యాధిర్మహాపాతేషుపాక్షికీ॥

తా॥ ఇరువదిమూడవతిథి, త్యాజ్యకాలము, అనువానియందు, జనించిన రోగము, ఎనిమిదిదినంబులును, మహాపాతయందు, జనించినరోగము, పదియేను దినంబులును, పీడించు.

శ్లో॥ రోగోద్భవోరాహుకాలే త్రిదినంక్రూరమాదిశేత్ । శనిస్థితర్క్షేరోగాప్తౌ సశేషోవత్సరావధి॥

తా॥ రాహుకాలమునజనించిన జ్వరము,మూడుదినములు,మిగులక్రూరముగనుండు, శనియున్ననక్షత్రమున జనించినరోగము, నొకవత్సరముపీడించు.

శ్లో॥ అంగారకస్థితర్క్షేషు సార్ధమాసంవినిర్దిశేత్। పంచాంగశుద్ధిసంయుక్తే క్షిప్రారోగ్యంవినిర్దిశేత్॥

తా॥ అంగారకుడున్న - నక్షత్రమున జనించినజ్వరము, నలుబదియైదు దినంబులుపీడించు పంచాంగశుద్ధిగలదివసమున జనించినజ్వరము, కడుశీఘ్రము గనివర్తించు.

శ్లో॥ శుభర్క్షే క్షేమతారాదౌ గురుచంద్రబలాన్వితే। వక్తవ్యం
సులభారోగ్యం దీర్ఘమాయుర్వినిర్దిశేత్॥

తా॥ శుభనక్షత్రమందును, క్షేమతారయందును, గురుచంద్రబలములుగలిగియుండునపుడును, జనించినరోగము, సుఖముగనివర్తించినదై, దీర్ఘాయుష్మంతునిగజేయు.

శ్లో॥ వ్యాయామవనితాసంగ యుద్ధచింతాభయాదిభిః। క్షౌరా
భ్యంజనవాతాద్యైర్దీర్ఘజాడ్యంవినిర్దిశేత్॥

తా॥ వ్యాయామము, స్త్రీసంగమము, యుద్ధచింత. భయము మొదలగువానివలనను, అయుష్కర్మము, అభ్యంజనము, వాతకాలము, అనువానివలనను, జాడ్యము, దీర్ఘమగు.

శ్లో॥ కీటలగ్నేవిషప్రాప్తౌ సార్పర్క్షే రాహుకాలగే। విషంహం
తినసందేహో జీవేద్గురుబలోదయే॥

తా॥ వృశ్చికలగ్నము, ఆర్ద్రానక్షత్రము, రాహుకాలము, అనువానియందు సర్పదష్టముగలవాడు, నిస్సంశయముగ మృత్యువుపాలగు- అయినను వానికి బృహస్పతి శుభుడుగానుండిన ఒకానొకసమయమున వాడుజీవించు.

శ్లో॥ సాంఘాతికఃకుంభలగ్నే మందాంశేగుళికోదయే। భర
ణ్యాముష్టమర్క్షేచ కాలచ్ఛిద్రంనజీవతి॥

తా॥ కుంభలగ్నమందును, శని అంశయందును, గుళికకాలమందును, భరణి, ఆశ్లేష నక్షత్రములయందును, సంధ్యాదులయందును, సాంతిభ్రాంతిగలిగిన మృత్యువునుజెందు.

శ్లో॥ క్షిత్యుత్కరేత్రిమార్గేచ శ్మశానేకంటకద్రుమే। ఆకస్మికా
నాంరోగాణా ముత్పత్తౌభయమాదిశేత్॥

తా॥ పెంటదిబ్బకు సమీపంబునను, మూడుమార్గము లొకటిగగూడిన స్థలంబునను, కాల్చినపీనుగుయొక్క యెముకలదిబ్బయందును, ముండ్లచెట్టుకు సమీపంబునను, అకస్మాత్తుగ జనించినరోగంబులు, భయంకరములుగనుండు.

శ్లో॥ దుస్స్వప్నందుర్నిమిత్తేచ గోదేవద్విజదూషణే। పైశాచి
కేసముత్పన్నో రోగస్తంబాధతేచిరాత్॥

తా॥ దుస్స్వప్నము, దుశ్శకునము, గోబ్రాహ్మణ, దేవతలదూషణ, పిశాచములుసోకుట, మొదలగువానివలన జనించినరోగము దీర్ఘకాలము బాధించు.

శ్లో॥ మసూరికాస్ఫోటకాదౌగడుదద్రురజేపివా। గుల్మగ్రంథిక్ష
తాదౌతుజ్వరంతత్కాలమాదిశేత్॥

తా॥ మసూరి, స్ఫోటకాదులు, కురుపు, దద్రు, గుల్మము, గ్రంథి, గాయము, అనువానిచేజనించినజ్వరము తత్కాలమునమాత్రముబాధించి నివృత్తియగు.

శ్లో॥ బాలగ్రహనిమిత్తేతు షోడశాహంతముచ్యతే। జ్వరాదిస
ర్వరోగాణా మేవంకాలాదినిర్ణయః॥

తా॥ బాలగ్రహముసోకుటచేజనించినజ్వరము, పదియారుదినంబులు బాధించు. ఇటుల, జ్వరాదిసర్వరోగకాలనిర్ణయంబుల నెఱుంగందగు.

## దూత లక్షణము.

శ్లో॥ ఆతురోపక్రమార్థీచ దూతోయాతిభిషగ్గృహే। తస్యపరీక్ష
ణంకార్యంయేనసంలక్ష్యతేగదః॥ ఏకోదూతస్సమాగచ్ఛే
ద్గృహీత్వావంశయష్టికామ్। మరణంతస్యజానీయాద్ద్వివ
సేసప్తమేతథా॥ ఏకోదూతస్సమాగచ్ఛేద్బ్రవీతిచపునః
పునః। లిఖితంమరణంతస్య యామైకేనచనిశ్చితమ్॥

తా॥ రోగివద్దనుండి, వైద్యునికడకేతెంచినదూతను, వైద్యుడుపరీక్షించి, రోగసాధ్యాసాధ్యంబుల నెఱుంగందగు. రోగివద్దనుండి-ఏతెంచినదూత, వెదురుకఱ్ఱచేతంబూని ఒంటరిగనేతెంచిన-రోగి, నేడవదినంబున, మృత్యువుపాలగునని ఎఱుంగవలయు. మఱియు, దూత వైద్యునికడకేతెంచి, తావచ్చినపనిని పలుమారుజెప్పుచుండిన, నారోగి యొకయామంబులో నిశ్చయముగ, యముని గృహంబు జేరునని యెఱుంగవలయు.

శ్లో॥ ద్వౌత్రయశ్చైవచత్వారఃవృద్ధస్త్రీబాలషండకాః। దుష్ట
వాక్యప్రవక్తారోరక్తాగ్నియమదిక్స్థితాః॥ శస్త్రాణిధారి

ర్థోభస్మపాషాణస్థిసమాశ్రితాః । ఏవంనగచ్ఛేత్సుభిష
గ్యశఃప్రాప్తిర్నవిద్యతే॥

తా॥ వైద్యునిపిలుచుటకు, ఇద్దరు, లేక- ముగ్గురు, లేక- నలుగురుదూత లేగినను, స్త్రీ, బాల, వృద్ధ, నపుంసకులేగినను, అమంగళకరవాక్యములవచియింపువారేగినను, అగ్ని, యమ, నిర్ఋతిదిక్కులలో నేనియందైనను, దూతనిలువంబడినవాడై- వైద్యునిబిలచినను, ఆయుధములచేబూనిగాని, రాయి, ఎముకలు. వీనిపైనిలువంబడిగాని వైదునిబిలచినను, అశుభంబు గలుగుగావున, వైద్యుండట్టిరోగికడకేగంజనదు.

శ్లో॥ షండాంధమూకబధిరంరుజపీడితంవాబాలం స్త్రియంచ
వికలంత్రిషితంచదీనమ్। శ్రాంతక్షుధాతురమపిభ్రమితం
చజీర్ణంమాతంనశస్తమపివేదవిదోవదంతి॥

తా॥ నపుంసకుడు, అంధుడు, మూగవాడు, చెవిటివాడు, రోగపీడితుడు, బాలుడు, స్త్రీ. అంగవైకల్యముగలవాడు, దప్పిగలవాడు, దీనుడు, బడలినవాడు, ఆకలిగొన్నవాడు, ఆతురుడు, చిత్తభ్రమగలవాడు, కృశించినవాడు, ఇట్టివారలు, దూతకృత్యమునందప్రశస్తులని, వేదవేత్తలువచించెదరు.

శ్లో॥ అగ్రభాగేపిచాయుష్యం కష్టంపృష్ఠవిభాగతః॥ వామేచశి
రసఃపీడామృత్యుర్భవతిదక్షిణే । ఖరోష్ట్రమహిషారూఢః
ప్లుతగద్గదకృచ్ఛ్రవాక్ । పాషణ్డో(స్త్రీ)చరోగార్తోనశస్తాదూ
తకర్మణి ॥ నపుంసక(స్త్రీ)బహవశ్చనగ్నాఃపాశాయుధాః
పాణివృషాణివా। సితేతరైశ్చాపిపటైర్వృతాజ్ఞాస్ని
గ్ధార్ద్రదేహాస్తృణషండినశ్చ। సన్యాసినఃపాణివిమర్దకా
శ్చఘ్రాణస్పృశఃప్రస్తరభేదినశ్చ। నఖద్విజోర్ధ్వాంగకఘు
ర్షశీలాశ్శోకాకులాశ్చాపిగదాభిభూతాః। చర్మాదిహస్తా
పరిషేకకాస్తేతథైవభోజ్యస్యనిశాసుచాపి। పృష్ఠప్రదేశే
దిశిచాపియామ్యామృత్యుచ్ఛభాగే భిషజాంవిశేషాత్ ।
దూతాస్సమాయాన్తినిరర్థమేతేవిపర్యయావ్యాధితప్రశ్న

తోవా। వైద్యస్యగేహేనహితస్యదృష్టాజీవస్థితిజ్ఞానిభిరత్ర.
ముఖ్యైః। ఆర్ద్రాశ్లేషామఘామూల జ్యేష్ఠాసుభరణీషుచ।
ఉపసర్పంతియేవైద్యం దూతాస్తేచాపిగర్హితాః॥

తా॥వైద్యునివద్దికేతెంచినదూత వానికగ్రభాగంబున,నిలచిన, రోగికాయుర్వృద్ధిగలుననియు, పృష్ఠభాగంబున నిలచినరోగికియొక్క రోగము, కష్టసాధ్యంబనియు, ఎడమపార్శ్వంబున నిలిచినరోగికి శిరోరోగముగలదనియు, దక్షిణపార్శ్వమునసిలచిన మృత్యువుగలుగుననియు, నెఱుంగవలయు. గాడిదె, ఒంటె, పోతు, వీనివాహనముగగలవాడై, నేతెంచినవాడు, ఓయిమని, దీర్ఘధ్వనితోవైద్యునిబిలుచువాడు, ఝత్తముగను, గద్గదిగలుపడువాడు, కష్టనాక్కుగలవాడు, పాషండుడు, స్త్రీ,రోగపీడితుడు.నపుంసకుడు,అనేకస్త్రీలు, దిగంబరుడు,పాశాయుధశృంగజములచేబూనినవాడు, తెలుపువర్ణముతప్ప, యితరవర్ణవస్త్రములధరించినవాడు, తైలముబూసికొనినవాడును, కసువుమోపును శిరమున ధరించినవాడు షండులు' సన్యాసులు, హస్తమునుపిసికికొనువాడు,ముక్కుసుస్పృశించువాడు, రాళ్లభేదించువాడు, నఖ, దంత, ఊర్ధ్వాంగముల - ఘుర్షణసేయుచుండువాడు, దుఃఖించువాడు, రోగపీడితుడు, చర్మాదులుహస్తమునధరించినవాడు,తడివస్త్రమునుధరించియుండువాడు, ఇట్టివారలు దూతకృత్యమునకప్రశస్తులు,దూత,వైద్యుడుభుజించునపుడేతెంచినను, రాత్రియందు వైద్యునిబిలుచుటకేతెంచినను, వైద్యునిగృహమునకేతెంచినదూత వానికిపృష్టభాగంబుననేని దక్షిణదిక్కుయందేని, ఉచ్చస్థానంబుననేని నిలువంబడియుండినను,రోగమును విపరీతంబుగవచించినను, రోగి కాలాంతకుని సదనంబులబ్రవేశించి యతనిభటులతో యుల్లాసంబుగ సల్లాపము సలుపుచుండునని బుద్ధిమంతుడగు వైద్యుండెఱుంగవలయు. ఆర్ద్ర, ఆశ్లేష, మఖ, మూల,జ్యేష్ఠ, భరణి, నక్షత్రములయందువైద్యునిపిలుచుటకేగెడుదూతలేనిందితులు.

శ్లో॥ శుక్లాంబరాః ఫలకరాఃదూతాశ్చప్రియవాదినః । అద్వి
తీయాశ్చభక్తాశ్చ వైద్యాహ్వానేప్రపూజితాః॥

తా॥ శ్వేతవస్త్రధారులును, పుష్పఫలాదులచేబూనినవారును, ప్రియాలాపంబులబలుకువారును, తానువచ్చునపుడు మఱియొకనిబిలుచుకొనివచ్చువారును, వైద్యభక్తులునునగు, దూతలుప్రశస్తులు.

## వైద్యోత్తమశకునములు.

శ్లో॥ భేరీమృదంగమృదుమర్దళశఙ్ఖవీణా వేదధ్వనిర్మధురమంగళ
గీతఘోషాః॥ పుత్రాన్వితాచయువతీసురభిస్సవత్సాధౌ
తాంబరశ్చరజకోభిముఖప్రశస్తః॥

తా॥ రోగివద్దకేగుచుండునెడ, వైద్యుడు- భేరీ, మృదంగ,మద్దళ, శంఖ, వీణామ్రోతనాకర్ణించినను, వేదధ్వని, మధురమై, మంగళకరముగనుండుగాన - ధ్వని,ఇవి వానికభిముఖంబై వచ్చుటనుగాంచినను, పుత్రునితోగూడిన స్త్రీ, దూడతోగూడినయావు, ధౌతవస్త్రయుక్తరజకుడు, వీరలెదుర్కొనినను,ప్రశస్తము

శ్లో॥ రాజావిప్రస్సుహృద్వేశ్యకుమారీవరవర్ణినీ।దధిచందనదూ
ర్వాశ్చగజాశ్వసురభీవృషాః ॥ మద్యంమాంసంమధుచ్ఛ
త్రం చామరాక్షతదర్పణాః। గోరోచనలతాపుష్పవస్త్రా
లంకారణానిచ॥ రౌప్యతామ్రమణిస్వర్ణప్రతిమాగోమయ
ధ్వజాః। మృత్తికాశస్త్రశాకాని ఘృతమీనప్రదీపకాః॥
ఫలంవర్ధాయనంవీణా పంకజానినృపాశనమ్। దృష్ట్వైవ
తానినరఃకుర్యాద్దక్షిణేనవిశేషతః॥

తా॥ రోగికడకేగువైద్యునికభిముఖంబుగ- రాజు, బ్రాహ్మణుడు, స్నేహితుడు, భోగముచాన, కన్యక, ఉత్తమస్త్రీ - అను-వారేతెంచినను,దధి, చందనము, గరికె, ఏనుగ, గుఱ్ఱము, పశువు,వృషభము,మద్యము,మాంసము, తేనె, ఛత్రము, చామరము, అక్షతలు, అద్దము, గోరోచనము, లతలు, పుష్పవస్త్రాద్యలంకారవస్తువులు, రౌప్యము, తామ్రము, మణులు,స్వర్ణము,ప్రతిమలు,గోమయము, ధ్వజము, మృత్తిక, ఆయుధములు,శాఖములు,ఘృతము, మత్స్యములు, మండుచుండెడిఅగ్ని, ఫలములు, వర్ధాయనము, వీణె, పద్మము, సింహాసనము - అనునవి నేతెంచినను, లేక - వానికిదక్షిణవైపుగనేతెంచినను, శుభశకునంబులని ఎఱుంగవలయు.

## వైద్యునికి - నిషిద్ధశకునములు.

శ్లో॥ తృణతుషఫణిచర్మాంగారకార్పాసపంకైర్లవణగుడవసా
స్థిక్లీబతైలౌషధాశ్చ। రిపువిడసితధాన్యంవ్యాధిమభ్యక్త
తైః పతితజటిలముండోన్మత్తవాతైర్నసిద్ధిః॥ రజోభస్మతు
షాంగార గుడతైలఖలోపలాః। గుర్విణీతైలస్నిగ్ధాంగన
గ్నముండరజస్వలాః॥ ముక్తకేశాస్థికార్పాస మార్జారో
రగపన్నగాః। రోదనంమార్గమానశ్చ వాహనస్యపలాయ
నమ్ ॥ ద్వారఘాతోద్భృశాసంయో విలంబఃపాణిపాద
యోః। ఏతానిదుర్నిమిత్తాని వర్జనీయానిసర్వదా॥

తా॥ వైద్యునికభిముఖముగ తృణములు, ఊక,సర్పము,చర్మము,పొగయుచుండునిప్ప, ప్రత్తి, అడుసు, లవణము, బెల్లము, మాంసములోనికొవ్వు, ఎముకలు, నపుంసకుడు, తైలము, ఔషధములు, శత్రువు, విష్ఠము, కృష్ణధాన్యములు, రోగి, తైలలేపనము జేసికొనియుండువాడు, మజ్జిగ, పతితుడు, జడలు ధరించినవాడు, బోడితలవాడు, పిచ్చివాడు, ఎదురుగాలి, ఇవినేతెంచిన - అశుభముగలుగు. మఱియు- దుమ్ము, బూడిదె, ఊక, నిప్ప, బెల్లము, తైలఘటము, క్రూరకర్మలసేయువాడు, రాళ్లు, గర్భిణీస్త్రీ, తైలస్నిగ్ధుడు, దిగంబరుడు, తలబోడిగలవాడు, రజస్వలలు, తలవిరియబోసుకొన్నవాడు, ఎముకలు, ప్రత్తి, మార్జాలము, సర్పములు, సర్పభేదములు,ఓరుమనిరోదనముసేయువాడు,అపానవాతమువిడుచువాడు, వాహనమునసుండివిడబడిపఱుగులిడు - అశ్వాదులునేతెంచినను,వానికి-ద్వారబంధనాభిఘాతగలిగినను,అంధుడు,కుంటివాడు,మొండివాడునేతెంచినను, దుశ్శకునంబులు కావున,అట్టితరి, రోగికడకు,వైద్యుండేగంజనడు.

## మూడువత్సరములమృత్యులక్షణము.

శ్లో॥ యామ్యానాసాపుటేయస్య వాయుర్యాతిదివానిశి।తథాం
తమేవంతస్యాయుః క్షయేదబ్దత్రయేణహి॥

తా॥ ఎవనికి, దక్షిణనాసాపుటయందహోరాత్రంబులు, వాయువువెడలుచుండెడినో, లేక- దానియందు, వాయువుక్షయించెడినో, అట్టివానికి - మూడువత్సరంబులలో - మరణముగలుగు.

## రెండవసంవత్సరమృత్యులక్షణము.

శ్లో॥ అకస్మాద్వీక్షితంయజ్ఞే పురుషంకృష్ణపింగళమ్।అస్మిన్న్వణేత
వరుణాత్సజీవేద్వత్సరద్వయమ్॥

తా॥ ఎవడకస్మాత్తుగ యజ్ఞ సమయమున కృష్ణవర్ణము, లేక పింగళవర్ణముగల పురుషుని నేని, ఉభయవర్ణములుగలపురుని నేని, అర్ధనారీశ్వరరూపముగలపురుషుని నేని, నృసింహరూపముగల పురుషుని నేని, గాంచెడినో అట్టివాడు రెండువత్సరంబులుజీవించు.

## సంవత్సరమృత్యులక్షణము.

శ్లో॥ జిహ్వాకృష్ణాభ వేద్యస్య ముఖంచకుంకుమారుణమ్। ఈదృ
శంలక్షణంయస్యతస్యమృత్యుర్నసంశయః। కుండలీపీడ్య
తేయస్యవా తేనహనుబంధనమ్।ఆహారోదహ్యతే తేనసవ
ర్ణేనవినశ్యతి। మూలేవృక్షస్యశాఖాయాంస్ఫులింగావహ్ని
సన్నిభాః।ప్రభాతిషడ్భిర్మాసైస్సఃమానవోమ్రియతేధ్రువం॥

తా॥ ఎవనినాలుక - నలుపువర్ణముగలదిగను, ముఖము, కుంకుమవలె - నెఱుపువర్ణముగలదిగనుండెడినో, అట్టివాడొకవత్సరములోనిశ్చయముగ - మృత్యువుపాలగు. ఎవనికి, కుండలిపీడకలిగియుండెడినో, చెక్కిళ్లు, వాతముచేబంధింపబడియుండెడినో, భుజించినయాహారము, వాతముచేపక్వముగాకుండెడినో, యట్టివాడొకవత్సరంబులోమరణముజెందు. వృక్షమూలశాఖయందు-అగ్నికణంబులుస్ఫురించునటులగాంచెడివాడాఱుమాసంబులలోమృత్యువుపాలగు.

శ్లో॥ యస్యరేతోమలంమూత్రం క్షుతంయుక్తంమలంతువా।
ఇహైకదాభవేద్యస్య అబ్దాంతస్యాయురిష్యతే॥ యస్యవై
భుక్తమాత్రస్య హృదయేవర్ధతేక్షుధా । జానీయాద్దంత
వర్షేచ సగతాయుర్నసంశయః॥

తా॥ ఎవనికి రేతస్సు, మలము, మూత్రము, కఫముఅనునవి, స్వభావవిరుద్ధముగ, నానావిధములుగదృశ్యంబయ్యెడినో, అట్టివాడొకవత్సరములోమృత్యువుసనీక్షించు. మఱియు, నెవనికి, భుజించినతక్షణంబహృదయమునయాకలిజనించెడినో, అట్టివాడొకవత్సరంబులో, నిశ్చయముగమరణంబుజెందు.

## పదియవమాసమృత్యులక్షణము.

శ్లో॥ అరశ్మివిఘ్నసూర్యస్య వహ్నేశ్చైవమలీనతా।జాతకాద
శమాసాన్తుతతోర్ధ్వంనతుజీవతి॥

తా॥ ఎవడు, సూర్యునికి,రణవిహీనునిగను, లేక-వైకృత్యముగలవానిగను, వహ్నిని మాలిన్యముగను గాంచెడినో, అట్టివాడు, పదిమాసంబులలో, మృత్యువుపాలగు.

## ఎనిమిదవమాసమృత్యులక్షణము.

శ్లో॥ గంధపుష్పాంశుకైర్మాంసై స్స్వాంతనుంభూషితంనరః।
యఃపశ్యేత్స్వప్నసమయేసోఽష్టౌమాసాంస్తుజీవతి॥

తా॥ ఎవడు, తననిజదేహము - గంధ, పుష్ప, వస్త్ర, మాంసంబులతో అలంకరింపబడినటుల - స్వప్నంబునగాంచెడినో, నట్టివాడెనిమిదిమాసంబులలో, మరణముజెందు.

## ఆఱుమాసములమృత్యులక్షణము.

శ్లో॥ ఇంద్రనీలనిభంవ్యోమ్ని నాగబృందంయదీక్ష్యతే।ఇతస్తతః
ప్రసరణంషణ్మాసంసతుజీవతి॥

తా॥ ఎవడు, ఆకసంబున, ఇంద్రనీలంబులవంటి - సర్పంబులుసంచరింపుచుండునటులగాంచెడినో, అట్టివాడారుమాసంబులుజీవించు.

శ్లో॥ సదాచోదరపూర్ణస్తు వారీచ్ఛాచదివానిశమ్। ప్రత్యక్షశ్చ
చతుఃపంచ షణ్మాసేతుసజీవతీ॥

తా॥ ఎవనికి, నీరుత్రాగినటుల, ఉదరము సదాఉబ్బియుండెడినో,దినారాత్రుల, జలపానేచ్ఛగలిగెడినో, అట్టివానికి, నాలుగు, లేక - అయిదు, లేక-ఆరుమాసంబులకుపిదప, మరణంబుగలుగు.

శ్లో॥ వేత్తినీలాదివర్ణస్య కట్వామ్లలవణస్యచ । అకస్మాదన్యథా
భావం షణ్మాసేనహిమృత్యుభాక్॥

తా॥ ఎవడు, నీలపీతాదివర్ణములను, కట్వామ్లలవణద్రవ్యములను, అకస్మాత్తుగ,విపరీతంబుగనెఱింగెడినో,అట్టివాడారుమాసంబులలోకాలగతినొందు.

శ్లో॥ ధ్రుతమారూఢశకట స్త్రీవంతోయస్యమస్తకః। ప్రయాతి
యాతితస్యాయుషణ్మాసాచ్చపరిక్షయమ్॥

తా॥ అతివేగముగల, శకటారోహణము జేసినటులగాని, శిరము, స్త్రీచి హ్నయుక్తముగనుండునటులగాని, స్వప్నమును గాంచెడివాడారుమాసంబులలో మరణంబుజెందు.

శ్లో॥ నిజాస్యప్రతిబింబహీ నీరదాంబుష్నుదర్పణే। ఉత్తమాంగం
యోనపశ్యేత్షణ్మాసేనవినశ్యతి॥

తా॥ ఎవనిముఖప్రతిబింబము గాని, శిరము గానీ, వర్షోదకము, అద్దములందు వానియందు గనుపడకుండెడినో, అట్టివాడారుమాసంబులలో మరణంబునొందు.

శ్లో॥ పాంసురాశించవల్మీకం యూపదండమథాపివా। యోవ
రోహతినౌస్వప్నేన షణ్మాసివినశ్యతి॥

తా॥ ధూళిరాశిని గాని, వల్మీకమును గాని, యూపదండమును గాని, పశువను గాని నెక్కినటుల స్వప్నము గాంచెడివాడారుమాసంబులలో మరణంబుజెందు.

శ్లో॥ రాసభారూఢమాత్మానం తైలాభ్యక్తంచఖండితమ్। నియ
మేనస్వాశ్రమే చేత్స్వప్నేపశ్యేత్సపూర్వజాన్॥ శమనం
తత్సుతంవాపియఃపశ్యేత్స్వప్నగోచరే। హతాఙ్గంశుష్క
కాష్ఠానివషణ్మాసినతిష్ఠతి॥

తా॥ ఖరవాహనారూఢుండైనటులను, తైలాభ్యంజనము చేసికొనినటులను, అంగచ్ఛేదనాయుక్తుండై నటులను, నియమము గలవాడై, స్వాశ్రమమున వసించుచుండునటులను, మృతులగు తనపూర్వికులగాంచినటులను, యముని గాని, వాని కొమరుని నేనివీక్షించినటులను, లేక - శుష్కకాష్ఠంబులవీక్షించినటులను, స్వప్నమును గాంచెడివాడారుమాసంబులలో మరణంబుజెందు.

శ్లో॥ లోహదండధరంకృష్ణం పురుషంకృష్ణపింగళమ్ । స్వాయ
మగ్రస్థితంపశ్యేత్తత్సమృత్యుప్రజాయతే॥

తా॥ లోహదండమును చేబూనిననల్లనిపురుషుడు, లేక- కృష్ణపింగళవర్ణముగల పురుషుడు, తన కెదురొక్కనినిలవంబడియుండునటుల - స్వప్నమును గాంచెడివాడారుమాసంబులలో మరణముజెందు.

శ్లో॥ ప్రతాపేనవినిర్ముక్తఃక్రుద్ధభాషీనిరుద్యమః । షణ్మాసేనతు
సందేహస్సగచ్ఛేద్యమశాసనే॥

తా ॥ ఎవడు, ప్రతాపము నశించినవానివలె నుండెడినో, పలుమారు కోపావిష్టుండై మాటలాడెడినో, పనులయందప్రవృత్తిగలవాడుగ నుండెడినో అట్టివాడారుమాసంబులలో యమునిశాసనమునకు నిశ్చయముగలోబడు.

## ఆరు, లేక - మూడు, లేక - రెండుమాసంబులలో, గలుగు - మృత్యులక్షణము.

శ్లో॥ లక్ష్యంలక్షుచికిత్సకేనమనసాశుద్ధస్వభానోశ్చతత్ । క్షీ
ణోదక్షిణపశ్చిమోత్తరపురస్త్రీద్విమాసైకకమ్। ఛిద్రం
మధ్యగతందినార్థమపిచేదాయుఃప్రమాణంధ్రువమ్। సర్వ
జ్ఞైఃపరిభాషితం స్ఫుటతరందృష్టోమహాన్ప్రత్యయః॥

తా॥ ఎవనికి సూర్యబింబము, దక్షిణభాగమున, క్షీణముగ దృశ్యంబయ్యెడినో, అట్టివాడారుమాసంబులలోను, పశ్చిమదిశయందు, క్షీణముగ దృశ్యంబయ్యెడినో, యట్టివాడు, మూడుమాసంబులలోను, ఉత్తరదిశయందు, క్షీణముగ దృశ్యంబయ్యెడినో, యట్టివాడు, రెండుమాసంబులలోను, పూర్వదిశయందు, క్షీణముగ దృశ్యంబయ్యెడినో, యట్టివాడొకమాసంబులోను, మధ్యభాగమున ఛిద్రయుక్తంబుగ నుండునటుల దృశ్యంబయ్యెడినో, యట్టివాడర్ధదినంబులోను, వైవస్వతునిపట్టణంబున కేగుదురని సర్వజ్ఞులగు, మహర్షులువచించెదరు. ఇది, దృఢముగ నమ్మతగిన మరణచిహ్నములు.

## అయిదవమాసికమృత్యులక్షణము.

శ్లో॥ సామర్థ్యేవానిధువనే ధ్వాంతాంతేక్షోభిచేన్మనః । నిశ్చి
తంపంచమేమాసి ధర్మరాజాతిథిర్భవేత్ ॥

తా ॥ విభవము కలిగియుండు, నపుడంధకారమున, స్త్రీసంభోగము సలుపుటయందెవని, మనముక్షోభను జెందెడినో, అట్టివాడైదుమాసంబులలో యమునికి అతిథిగనగు.

శ్లో॥ పృథివీద్విర్ధా భేద్యస్య పదంఖండపదాకృతిః। పార్శ్వే వా
ఖండితే వాపి పంచమాసం సజీవతి॥

తా॥ అకస్మాత్తుగ భూమిరెండుభాగంబులైనట్టును, భూమియందుంచబడిన పాదము ఖండాకృతిగనగుపడినను, పార్శ్వదేశంబులు ఖండింపంబడినట్టును, స్వప్నమునుగాంచెడి వాడైదుమాసంబులు జీవించు.

శ్లో॥ ప్లక్షతే భక్షతే వాపి పిశాచఖరరాక్షసైః। భూతైః ప్రేతై
శ్శ్వభిస్సింహైర్వ్యమాయుగృధ్రసూకరైః । శరభైశ్శల
భైస్సేనైరశ్వైరశ్వతరైర్బకైః । స్వప్నేస్సంజీవితంత్య
క్త్వా వర్షాంతేయమమీక్షతే॥

తా॥ వృక్షాద్యవరోహణము చేసినటులను, అన్నమును భుజించినటులను, పిశాచములు, ఖరములు, రక్కసులు, భూతములు, ప్రేతములు, కుక్కలు, సింహములు, నక్కలు, గద్దలు, వరాహములు, శరభములు, శలభములు, సేనలు, అశ్వములు, కంచరగాడిదెలు, కొంగలు, అనువానిచే తనప్రాణంబులబో గొట్టుకొనినట్టును, స్వప్నమునుగాంచెడి వాడొకవత్సరము సజీవుడుగనుండి పిదపయమునివీక్షించు.

శ్లో॥ కాకవిష్ఠాసమో యస్య పాంసువర్ణసమోమలః। స్వచ్ఛా
యామన్యథాపశ్యేద్యస్స జీవతిపంచమమ్॥

తా॥ ఎవనిమలము కాకవిష్ఠాసదృశముగను, లేక, ధూళివర్ణముతోసమానముగనుసుండెడినో, అట్టివాడైదుమాసంబులలో మరణంబుజెందు. మఱియు తనఛాయను విపరీతముగగాంచెడి వాడునైదుమాసంబులో మరణముజెందు.

త్రిమాసికమృత్యులక్షణము.

శ్లో॥ ప్రత్యూషస్యాపియస్యాసుహృదయంయస్యశుష్యతి। చర
ణౌచకరౌవాపిత్రిమాసంతస్యజీవనమ్॥

తా॥ ప్రభాతకాలంబున, నెవనిహృదయము, హస్తములు, పాదములు, శోషించెడినో, నట్టివాడు మూడుమాసంబులుజీవించు.

శ్లో॥ అనభ్రాంవిద్యుతందృష్ట్వా దక్షిణాందిశమాస్థితామ్। తథై
కోపిధనుర్వాపి జీవితంచత్రిమాసికమ్॥

తా॥ ఎవడు మేఘహీనంబుగనుండునపుడు, మెరుపును, దక్షిణదిశయందు ఇంద్రధనుస్సును గాంచెడినో, నట్టివాడు, మూడుమాసంబులుజీవించు.

శ్లో॥ వర్ణహీనశ్చ కామేన స్వాదేనైవతథైవచ। త్రిభిర్మాసైశ్చ
సోజీవేత్సగచ్ఛేద్యమశాసనే॥

తా॥ ఎవ్వాడు కాంతివిహీనుడుగ, కామవిహీనుడుగ, రసజ్ఞానవిహీనుడుగనుండెడినో, యట్టివాడు, మూడుమాసంబులవరకు, సజీవుండుగనుండి పిదప, యమునిశాసనమునకులోబడు.

ఒకటిన్నరమాసమృత్యులక్షణము.

శ్లో॥ ద్వ్యహం వారాత్రతంత్ర్యహం వారాత్రం వాయుగ్వహతిస
న్తతమ్। సార్థైకమాసాన్తస్యాపిజీవితంకిలహీయతే॥

తా॥ ఎడతెగక, రెండు, లేక, మూడుదినంబులు, ప్రబలశ్వాసము, నాసారంధ్రంబులనుండి, వెడలుచుండువాడొకటిన్నర మాసంబున, మరణంబుజెందు.

మాసికమృత్యులక్షణము.

శ్లో॥ కరావబుద్ధశ్రవణఃనశృణోతిస్వకంధ్వనిమ్। స్థూలకృశం
కృశంస్థూలంతదా మాస్యనువర్తతే॥

తా॥ ఎవనికిచెవులుమూసికొని, అకస్మాత్తుగ కర్ణఘోషము వినుపించకుండెడినో, స్థూలంబుగనుండు దేహమకస్మాత్తుగ కృశించెడినో, కృశించిన దేహమకస్మాత్తుగబలిసెడినో, యట్టివాడొకమాసంబులో, మరణంబుజెందు.

శ్లో॥ కాళీంకుమారీంయస్స్వప్నే బధ్నీయాద్బహుపాశకైః।
సమాంసేనసమీక్షేతనగరీంశమనోషితామ్॥

తా॥ ఎవడుస్వప్నంబున నల్లని స్త్రీనిగాంచెడినో, అనేకసూత్రములతో బంధింపబడినటుల గాంచెడినో, నట్టివాడు యమునిచే పరిపాలింపంబడుచుండు నగరమున ఒకమాసములో ప్రవేశించు.

శ్లో॥ ఘృతేతైలేదర్పణేచతోయేవాతనువానరీమ్।యఃపశ్యేదశి
రస్కంధం మాసాదూర్ధ్వంనజీవతి॥

తా॥ ఎవడు ఘృతము, తైలము, అద్దము, జలము, అనుపానిలో ఒని యుండేని తానువానరరూపముగలవాడైనుండునటుల గాంచెడినో, లేక శిరోవిహీనుండై నుండునటుల గాంచెడినో, నట్టివాడొకమాసంబులో, మరణంబుజెందు.

శ్లో॥ అశక్తఃపాణ్డువర్ణశ్చబహునిశ్వాససంయుతః। మలంచ
పతతేనిత్యం మాసమేకంసజీవతి॥

తా॥ఎవనికి నిష్కారణముగ దేహమునందశక్తి, పాండువర్ణము,మిగుల నిశ్వాసే, ప్రత్యహము, మిగులమలోత్సర్జనము, గలిగెడినో, అట్టివాడొకమాసమువరకు, సజీవుడుగనుండి తదనంతరము, యమునినిలయంబున కేగు,

పదియవదినమృత్యులక్షణము.

శ్లో॥ యస్యవైన్లానమూర్తేశ్చ కూపోపమవిశుష్యతి। పతితస్యజ
లంపేయంద శాహంసోపిజీవతి॥

తా॥ ఎవనికిశరీర మకస్మాత్తుగవాడెడినో,ముఖముకూపమువలెశుష్కించెడినో, పానానంతరము, ముఖమువాడినట్లుండెడినో, జలముదేహమునందంటకుంచెడినో, అట్టివానికి పదిదినంబులలో, మృత్యువుగలుగు.

ఏడుదినముల మృత్యులక్షణము.

శ్లో॥ ధారాబిందుసమంయస్యపతతేచమహీతలే। సప్తాహాజ్జా
యతేమృత్యుః కాలజ్ఞానేనభాషితమ్॥

తా॥ ఎవడు అగ్నికణంబులు. వర్షబిందువులవలె భూపతనంబగునటుల గాంచెడినో, అట్టివాడేడుదినంబులలో ,మృత్యువునుగాంచునని, కాలజ్ఞానులు వచించెదరు.

ఐదవదినమృత్యులక్షణము.

శ్లో॥ యోనపశ్యేన్నిజచ్ఛాయాం దక్షిణాశాసమాశ్రితామ్।
దినానిపఞ్చజీవాత్మా పంచత్వంచప్రయాతిసః॥

తా॥ ఎవడు తనశరీరచ్ఛాయను గాంచకుండెడినో, తనఛాయ దక్షిణ దిశయందు ప్రసరించినటులగాంచెడినో, నట్టివాడయిదు దినంబులలో మృత్యువుపాలగు,

శ్లో॥ నరోయోవానరారూఢో ప్రయాతిపశ్చిమాందిశమ్। స్వ
ప్నేసోహ్నపంచమేనపశ్యేత్సంయమనీంపురీమ్॥

తా॥ ఎవడువానరారూఢుండై, పశ్చిమదిశకేగినటుల, స్వప్నముగాంచెడినో, నట్టివాడైదుదినంబులలో, సంయమనీపురంబునుగాంచు.

మూడవదినమృత్యులక్షణము.

శ్లో॥ నరనాసాపుటంయుగేదశాహాని నిరంతరమ్। వాయుశ్చ
త్సహసాక్రాంతస్సజీవేద్దివసత్రయమ్॥

తా॥ ఎవనినాసాపుటలయందు, పదిదినములు నిరంతరముగ వాయువు బైలువెడలక బంధింపబడియుండెడినో, అట్టివాడు మూడుదినంబులు జీవించు.

రెండవదివసమృత్యులక్షణము.

శ్లో॥ నాసావర్తద్వయంహిత్వా వాయోరూష్మా ముఖాద్వ
హేత్। నశ్యేద్దినద్వయాదర్వాగ్జీవితంతస్యనిశ్చితమ్॥

తా॥ ఎవనికి వాయువునాసాపుట ద్వయములవిడనాడి ముఖమున ఉష్ణముగ బైలువెడలెడినో, అట్టివాడు, నిశ్చయముగ రెండుదినములలో నశించు-

అర్ధరాత్రిమృత్యులక్షణము.

శ్లో॥ శక్రాయుధంచార్ధరాత్రే దివాగ్రహణకస్తథా। దృష్ట
మాత్రేణసంక్షీణమాయుర్జీవితమాత్మవిత్॥

తా॥ అర్ధరాత్రియందింద్రధనుస్సును, పగటియందు చంద్రబింబును, గాంచెడివాని, ఆయువుక్షయించునని తెలియవలయు.

శ్లో॥ నాసికావక్రతామేతికర్ణయోరపిచోన్నతిః। నేత్రేభావ్యం
స్రవేద్యస్య తయోరేవంసమున్నతిః। ఆరక్తమేతివక్త్రం
చజిహ్వాహ్రస్వాయతేయదా। తదాప్రాజ్ఞోవిజానీయా
న్మృత్యుమాసికమాప్నుయాత్॥

తా॥ ఎవనికి ముక్కు వంకరగను, చెవులు పొడవుగను, నేత్రములనీరు స్రవింపుచును, నేత్రములు ఉన్నతములుగను, ముఖంబెఱ్ఱగను, నాలుకలోపలికీడ్చుకొనియు నుండెడినో, అట్టివాడొకమాసంబులో, మరణము జెందునని, బుద్ధిమంతులెఱుంగవలయు.

శ్లో॥ పిధాయకర్ణనిర్ఘోషన్నశృణోతినిరన్తరమ్। నపశ్యేచ్చక్షు
షోర్జ్యోతిర్యస్యఆసన్నజీవితమ్॥

తా॥ కర్ణములుమూసికొనిన వానిఘోషమునిరంతరము, వినుపించకుండెడి వానికిని, నేత్రజ్యోతి నశించినవానికిని, మృత్యువాసన్నంబైనదని నెఱుంగందగు.

శ్లో॥ దీపనిర్వాణగంధస్యసుహృద్వాక్యమరుంధతీమ్। నజిఘ్రం
తినశృణ్వంతినపశ్యంతిగతాయుషః॥

తా॥ ఎవనికి దీపమువార్చిన వాసనతెలియకుండెడినో, స్నేహితుల వాక్యములయందసూయగలిగెడినో, అరుంధతిదృశ్యముగాకుండెడినో, వాసన తెలియకుండెడినో, అకస్మాత్తుగ శబ్దమువినరాకుండెడినో, అట్టివానికిఆయువుక్షీణించినదని నెఱుంగవలయు.

సద్యోమృత్యులక్షణము.

శ్లో॥ శక్త్యావానరయానస్థో యోగంతుందక్షిణాందిశమ్। స్వ
ప్నేప్రయాతితస్యాపిముహుర్తాన్మృత్యుర్నముంచతి॥

తా॥ ఎవడుతనసామర్థ్యమును, తెలియంజేయుచు వానరారూఢుండై దక్షిణదిశ కేగునటుల స్వప్నమునుగాంచెడినో, అట్టివాఁడు తత్క్షణంబునమృత్యువగు.

॥ నగ్నంక్షపణకంస్వప్నే దృశ్యమానంమహాబలమ్। ఏకా
ద్వావహ్నికంతస్యవిద్యాన్మృత్యుముపస్థితమ్ ॥ సూర్యో
దయేశివాయస్య క్రోశన్యాయాతిసన్ముఖమ్। విపరీతంపు
రీషం వాసద్యోమృత్యుంసగచ్ఛతి॥

తా॥ ఎవడుస్వప్నంబున దిగంబరుని, బౌద్ధవిశేషుని, మహాబలిష్ఠుని, గాంచెడినో, అట్టివాడొకటి, లేక రెండుదినంబులలో మృత్యువుపాలగు, ఎవనికెదురుగా, సూర్యోదయకాలంబున, నక్కలరుచుచుపరుగెత్తివచ్చెడినో, విపరీతముగ - మలము వెడలెడినో, అట్టివానికి, తత్క్షణమున, మృత్యువుగలుగు.

సర్పాదిదంశమృత్యులక్షణము.

శ్లో॥ సూర్యేసప్తమరాసిస్థే జన్మసంస్థేనిశాకరే। దంష్ట్రీరస్త
తుష్పార్ణకాలే ప్యకాలేతస్యనాశితాః॥

తా॥ జన్మరాశికిసప్తమమున - సూర్యుడును, జన్మమున - చంద్రుడుండిన, విషసంబంధ - సర్పదంష్ట్రీదంశనముగలవాడై, అకాలమున నశించు.

అథప్రాయశ్చిత్తహీనే - వ్యాధిభోగకథనము.

శ్లో॥ ప్రాయశ్చిత్తవిహీనానాన్మహాపాతకినామపి। నరకాన్తే
భవేజ్జన్మచిహ్నాంకితశరీరిణామ్ ॥ ప్రతిజన్మభవేత్తేషాంచి
హ్నంతత్పాపసూచితమ్। ప్రాయశ్చిత్తేకృతేయాతిపశ్చా
త్తాపవతాంపునః। మహాపాతకజంచిహ్నంజాయతేసప్త
జన్మని । ఉపపాపోద్భవంపఞ్చత్రీణిపాపసముద్భవమ్ ॥
దుష్కర్మజానృణాంరోగా యాంతిచోపక్రమైశ్శమమ్ ॥

తా॥ బ్రహ్మహత్యాది మహాపాతకంబులు, ఉపపాతకంబులు, మొదలగువాని ఇహలోకంబున జేసినివాడుతన్నివర్తకప్రాయశ్చిత్తంబులజేసికొనవలయు ఇటులజేసికొనకుండిన నరకానుభవంబవశ్యంబుగగలుగునరకాంతమున తత్తత్పాపానుగుణచిహ్నంబుగలవాడై యీలోకమున శరీరముతోజనించు మఱియు తత్పాపచిహ్నంబులు ప్రతిజన్మమునఅనువర్తింపుచుండు, దానమునుజేసిపశ్చాత్తాపయుక్తుండై శాస్త్రోక్తప్రాయశ్చిత్తంబులజేసుకొనిన పూర్వోక్తపాపచిహ్నంబులునివర్తించు. మరియు బ్రహ్మహత్యాదిమహాపాతకచిహ్నంబులేడు జన్మములనువర్తించు గోవధాదిచిహ్న ఉపపాతకంబులైదుజన్మములను వర్తించుగాన దుష్కర్మజనిత రోగంబులు చికిత్సలచే శాంతినిజెందు.

మహాపాతకరోగనిర్ణయము.

శ్లో॥ కుష్ఠంచరాజయక్ష్మాచప్రమేహోగ్రహణీతథా। మూత్ర
కృచ్ఛ్రాశ్మరీకాసాఃఅతీసారభగన్దరౌ। దుష్టవ్రణంగణ్డమా

ూపశ్వాఘాతో౽క్షినాశనమ్। ఇత్యేవమాదయోరోగాః
మహాపాపోద్భవాస్స్మృతాః॥

తా॥ కుష్ఠువు, రాజయక్ష్మ, ప్రమేహము, సంగ్రహణి, మూత్రకృఛ్రము, అశ్మరి, కాస, అతిసారము, భగందరము, దుష్టవ్రణము, గండమాల, పక్షాఘాతము, అక్షతత్వము - మొదలగురోగంబులు. మహాపాతకజనితంబులు.

## ఉపపాతకరోగనిర్ణయము.

శ్లో॥ జలోదరీయకృత్ప్లీహశూలరోగవ్రణానిచ। శ్వాసజీర్ణజ్వ
రచ్ఛర్ది భ్రమమోహగళగ్రహాః। రక్తార్బుదవిసర్పాద్యా
ఉపపాపోద్భవాగదాః॥

తా॥ జలోదరము. యకృత్ప్లీహములు. శూల, వ్రణములు. శ్వాస, అజీర్ణము, జ్వరము, ఛర్ది, భ్రమ, మోహము, గళగ్రహము. రక్తార్బుదము, విసర్పము - మొదలగునవి, ఉపపాతకజనితంబులు.

## సామాన్యజరోగనిర్ణయము.

శ్లో॥ దంతాపతాలకశ్చిత్ర వపుకంపవిచర్చికా। వల్మీకపుణ్డరి
కాద్యరోగాపాపసముద్భవాః॥

తా॥ దంతాపతాలకము, చిత్రవపు, కంపము, విచర్చిక, వల్మీకము, పుండరీకము, మొదలగునవిసామాన్య పాపజనితరోగంబులు.

## అతిపాపరోగనిర్ణయము.

శ్లో॥ అధార్శాద్యాన్నృణాంరోగా అతిపాపాద్భవంతిహి॥

తా॥ అర్శస్సుమొదలగునవి అతిపాతకజనితరోగంబులనియెఱుంగవలయు.

కా ల జ్ఞా న ము,

ము గి సె ను.

